

ఫిల్మ్‌నగర్



# 'బరువై'న పాత్రల కోసం..



హీరోలంటే రాజకుమారుల్లా, హీరోయిన్లంటే మెరుపుతీగల్లా ఉండాలనే కాన్సెప్ట్‌కు కాలం చెల్లుతోంది. పాత్రల డిమాండ్ మేరకు సహజత్వం కోసం స్టార్లు తమ శరీరాకృతిని మార్చుకోక తప్పడం లేదు. అమీర్‌ఖాన్ తన తాజా సినిమా 'దంగల్'లో మల్లయోధుడు మహవీర్ పోగట్ పాత్ర కోసం 70 కిలోల నుంచి 97 కిలోల బరువు పెరిగాడు. ఆ తర్వాత శ్రమించి మళ్లీ మామూలుగా మారాడు. ఆ మొత్తం ప్రక్రియను ('ఫాట్ టు ఫిట్' వీడియో పేరిట) ఇటీవల సోషల్‌నెట్‌వర్క్‌లో పెడితే అది కూడా సూపర్‌హిట్ అయ్యింది. అమీర్‌లాగే గతంలో పాత్రల కోసం బరువు పెరిగిన వారిలో భూమి పెడ్నేకర్ (ధమ్ లగాకే హైసా), ప్రియాంక చోప్రా (సాత్ ఖూన్ మాఫ్), విద్యాబాలన్ (డర్టీపిక్చర్), అభిషేక్‌బచ్చన్ (గురు), కరీనాకపూర్ (3 ఇడియట్స్)వంటి వారున్నారు. లేటెస్ట్‌గా సంజయ్‌దత్ జీవితకథ ఆధారంగా రాజ్‌కుమార్ హిరానీ తెరకెక్కిస్తున్న సినిమా కోసం రణ్‌బీర్‌కపూర్ కూడా బరువు పెరిగే ప్రయత్నంలో ఉన్నాడట.



## ఇండెక్స్








ఆదివారం ఆంధ్రజ్యోతి
11 డిసెంబర్ 2016


## ఇన్‌బాక్స్

### విజ్ఞానదాయకం

ఈ వారం కవర్‌స్టోరీ 'బొమ్మల్లో సైన్స్' విజ్ఞానదాయకంగా ఉంది. సైన్స్ విద్యార్థులకు మాత్రమే అర్థమయ్యే శాస్త్రోక్తమైన విషయాలను సామాన్యులకు కూడా అర్థమయ్యే విధంగా వివరించి చెప్పారు. ఐఐఎస్‌సి చేస్తున్న ఈ అద్భుతమైన ప్రయోగం గురించి అనంత సురేష్‌గారు వివరించిన తీరు చాలా బాగుంది. జానపద రీతుల్లో ప్రజల వద్దకు ఆధునిక శాస్త్ర విషయాలను తీసుకెళ్లగలిగితే, సారవంతమైన పొలంలో మేలైన విత్తనాలను వెదజల్లినప్పుడు కలిగే ప్రయోజనం కలుగుతుంది. అన్నీ అనుకూలంగా ఉన్న చోట విత్తనాలు మొలకెత్తి స్వతంత్రంగా మహావృక్షాలవుతాయి. ఈ బొమ్మల్లో సైన్స్‌తో పాటు సృజనాత్మకతను కూడా జోడించిన ఆర్టిస్టుల ప్రతిభకు జోహార్లు చెప్పాల్సిందే! ఈ మహత్తర ప్రయత్నంలో పాలుపంచుకుంటున్న వారందరికీ అభినందనలు.

**- సుధాకర్ ఉణుదుర్తి**, ఈమెయిల్

• • •

'బొమ్మల్లో సైన్స్' ప్రయోగం విద్యార్థులందరికీ ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది. అక్షరాలను అందమైన బొమ్మలో ఇముడ్చుతారని 'అరుంధతి' సినిమాలో చూసి తెలుసుకున్నాం. అయితే అక్షరాలు మాత్రమే కాకుండా గణిత, సామాన్య, విజ్ఞాన శాస్త్ర విషయాలను కూర్చి కూడా బొమ్మలను అందంగా గీయవచ్చని ఈ కవర్‌స్టోరీ చదివి తెలుసుకున్నాం. ప్రయోజనకరమైన అంశాలను అందించడంలో ఆంధ్రజ్యోతికి సాటి మరెవరూ రారని ఈ కవర్‌స్టోరీ ద్వారా మరోసారి నిరూపించారు.

**- ఎల్. ప్రఫుల్ల చంద్ర**, ధర్మవరం; **టి. మూర్తి**, ప్రకాష్‌నగర్

### ఆనాటి వాన చినుకులు

ఈ వారం కథ 'ఆనాటి చెలిమి ఒక కల' మనసును సున్నితంగా తాకింది. కథ చదువుతుంటే తెలియకుండానే కళ్లు చెమ్మగిల్లాయి. మధురమైన స్నేహంలోని మరిచిపోలేని జ్ఞాపకాలను మాత్రమే అందిస్తున్నారని అనిపించింది కథ మొదట్లో. అయితే రాజు పాత్ర ద్వారా ఎంతో సున్నితమైన విషయాలను సూటిగా చెప్పారు రచయిత. తాను ఇష్టపడిన వ్యక్తి ఎటువంటి పరిస్థితుల్లో ఉందో అనే ఆలోచన కూడా మరిచిపోయి, తనని తాకాలని రాజులో కలిగిన కోరిక కథలో నికార్సయిన సహజత్వాన్ని తీసుకొచ్చింది. కథలో కీలకమైన 'ఆనాటి వాన చినుకులు' అనే మాటనే శీర్షికగా పెట్టి ఉంటే బాగుండేదనిపించింది.

**- ఉమాసుభా ప్రసూన**, విశాఖపట్నం ; **రెడ్డి శాస్త్రి**, శ్రీకాకుళం

• • •

'ఆనాటి చెలిమి ఒక కల' కథ సూపర్బ్. మా కోనసీమలోని అమలాపురం చుట్టూరా ఉన్న గ్రామాలను కథలో వాడడం సంతోషానిచ్చింది. నా జీవితానికి దగ్గరగా ఉందీ కథ. అమలాపురంలో ఉంటూ పత్రికలకు అదే పనిగా రచనలు చేశానొకప్పుడు. ఇప్పుడు పాల్వంచలో ఉంటున్నాను. ఒక అందమైన కలగా మారిన ఆనాటి స్నేహం, అప్పటి స్నేహితులు ఎలా ఉన్నారో, ఎక్కడున్నారో మరోసారి కలవాలనిపిస్తోంది. మిత్రులు ఈ ఉత్తరం చదివి ఫోన్ చేస్తారని ఆశిస్తున్నా.

**- సి.హెచ్.వి.వి.ఎస్. మూర్తి**, పాల్వంచ

### ఆయనో అద్భుతం

'సజీవ విగ్రహం' వ్యాసం బాగా నచ్చింది. రెండు నిమిషాలు కన్ను ఆర్పకపోతేనే కష్టంగా ఉంటుంది మనకు. అలాంటిది గంటలకు గంటలు కంటి రెప్ప వేయకుండా అలా విగ్రహంలా నిల్చోవడం నిజంగా ఒక అద్భుతమైన ప్రతిభ. పని మీద రఫీకి ఉన్న ప్రేమ, గౌరవం, అంకితభావం వల్లే అతనికి ఇంతటి నిగ్రహం అబ్బి ఇలా విగ్రహంలా మార్చేసి ఉంటుంది.

**- ఐ.వి.ఎస్. జయరాం**, శ్రీకాకుళం

### గ్రేట్ అంకుల్

సిరియాలో పిల్లల కోసం బొమ్మలు పంచిపెడుతున్న రమీ అదామ్ గురించి తెలియజేసిన 'టాయ్ అంకుల్' వ్యాసం చాలా బాగుంది. చిన్న పిల్లల ముఖాల్లో చిరునవ్వు చూడడం కోసం తన ప్రాణాలను కూడా లెక్కచేయకుండా అతను చేస్తున్న ఈ సహాయం ప్రశంసనీయం. కన్నబిడ్డల కోసం కూడా సమయం కేటాయించలేని బిజీ తల్లిదండ్రులున్న ఈ కాలంలో.. ఆపదలో ఉన్న వారి పిల్లల భవిష్యత్తు కోసం ఎన్నో కష్టాలను అనుభవిస్తున్న రమీ అదామ్ లాంటి వ్యక్తులు మన మధ్య మిగిలి ఉండడం ఆనందించాల్సిన విషయం.

**- ఎస్. కృష్ణబాబు**, పాలుకూరు, **బ్రహ్మానంద శాస్త్రి**, హైద్రాబాద్

'ఆదివారం అనుబంధం'పై మీ అభిప్రాయాలను శుక్రవారంలోగా అందేలా పంపగలరు. ఆలస్యంగా అందిన ఉత్తరాలు ప్రచురించడం సాధ్యపడదని మనవి. sunday.aj@gmail.com కి మీ ఉత్తరాల్ని మెయిల్ చేయవచ్చు.



# నిప్పు కిళ్లీ..

తమలపాకుపై సున్నం రాసి, కాసింత వక్కా, సోంపు, జాపత్రి, ఇంకా రకరకాల పదార్థాలను ఒక పద్ధతిలో వేసి కట్టి ఇచ్చే 'పాన్' నోట్లో పడనిదే రోజు గడవదు చాలామందికి. మన దేశంతో పాటు శ్రీలంక, వియత్నాం, బంగ్లాదేశ్, మయమ్మార్, నేపాల్ వంటి కొన్ని సరిహద్దు దేశాల్లో కూడా తమలపాకు తాంబూలం ఒక సంప్రదాయక జీర్ణౌషధం. భోజనం చేసిన తర్వాత పాన్ నోట్లో వేసుకుంటే నూతన ఉత్తేజం, శక్తి వస్తాయనే నమ్మకం ప్రబలంగా ఉంది. జర్దా పాన్, మీఠా పాన్, మసాలా పాన్, కూల్ పాన్, పీటీ పాన్ అంటూ పాన్‌లో ఎన్నో రకాలు ఉన్నాయి. అయితే గుజరాత్‌లోని రాజ్‌కోట్‌లో వీటన్నింటికీ మించిన ఒక రకం పాన్ పాన్‌ప్రియులను విశేషంగా ఆకట్టుకుంటోంది. అదే 'ఫైర్ పాన్'. అంటే నిప్పుతో పాటు పాన్‌ను గుటకాయస్వాహా అని మింగేయడం. వినడానికి వింతగా ఉన్నా ఈ ఫైర్ పాన్‌ను ఎనిమిదేళ్లుగా తయారుచేస్తున్నాడు 'గెలాక్సీ పాన్ షాప్' యజమాని ప్రేమ్ తడ్వానీ.

"ముప్ఫైయేళ్లుగా నేను పాన్‌షాప్ నడిపిస్తున్నాను. కొత్త కొత్త పాన్ వెరైటీలను తయారుచేయాలని నిత్యం అనేక ప్రయోగాలు చేస్తుంటాను. ఒకసారి ముంబైలో ఒక బార్‌కి వెళ్లినప్పుడు అక్కడ చిన్న గ్లాసులో వోడ్కా పోసి మంట పెట్టి 'షాట్' అని ఇవ్వడం చూశాను. అప్పుడే నాకు పాన్‌ను కూడా ఇలా తయారుచేస్తే ఎలా ఉంటుందా? అనే ఆలోచన వచ్చింది. 45 రోజులు అనేక రకాలుగా ప్రయోగాలు చేసి చివరకు ఈ పాన్‌ను కనిపెట్టాను. భారతదేశంలో పొగాకు లేకుండా తయారుచేసే ఒకేఒక్క పాన్ ఇదే" అని చెప్పాడు ప్రేమ్ తడ్వానీ. తమలపాకుపై సున్నం రాసి సోంపు, కుంకుమ, వక్కపొడి, చెర్రీపండు, మరికొన్ని దినుసులు వేసి ఆకును చుట్టేసి దానిపైన 5 లవంగాలను గుచ్చి, వాటికి మంట పెట్టి, అవి మండుతుండగానే నోరు పెద్దగా తెరవమని నేరుగా నోట్లోనే పాన్ పెడతాడు ప్రేమ్ తడ్వానీ. నోట్లోంచి ఘాటైన పొగలు రప్పించే ఈ ఫైర్ పాన్ జలుబును ఇట్టే దూరం చేస్తుందని చెబుతాడు ఈయన. ఈ ఫైర్ పాన్ ధర 30 రూపాయలు. ఇతడిని ప్రేరణగా తీసుకొని ఢిల్లీ, కలకత్తా తదితర నగరాల్లో కూడా ఫైర్ పాన్‌ను తయారుచేస్తున్నారు కొందరు పాన్‌షాప్ నిర్వాహకులు. ■

# ఓ శాకాహార మకరం!

**వెయ్యేళ్ల చరిత్ర గలిగిన ఒక ఆలయం.**
**ఆ ఆలయాన్ని రక్షిస్తూ ఓ సాధు మొసలి.**
**మొసలిని సాధువంటున్నారేమిటి అనుకుంటున్నారా!**
**అదే విశేషం.**



ఎటుచూసినా పచ్చదనంతో కనువిందు చేసే కేరళలోని కేసర్‌గడ్ జిల్లాలో అనంతపుర మహావిష్ణు ఆలయంలో ఒక సరస్సు ఉంది. ప్రశాంతమైన వాతావరణంలో ఆధ్యాత్మిక గాంభీర్యాన్ని సంతరించుకున్నట్టు కనిపిస్తుందీ ఆలయం. తిరువనంతపురంలోని అనంతపద్మనాభ స్వామి ఆలయానికి... ఇది మూలస్థానం. ఈ ఆలయంలో పద్మనాభస్వామి ఆదిశేషునిపై ఆసీనుడై కనిపిస్తాడు. ఆలయం చుట్టూ ఉండే సరస్సులోనే ఈ సాధు మొసలి తిరుగాడుతూ ఉంటుంది. దాని పేరు బాబియా (Babia). బియ్యం, బెల్లం కలిపి చేసే పొంగలి మాత్రమే తింటుంది అది. ఆలయానికి పహారా కాస్తూ తిరగడమే తప్ప సరస్సులో ఉన్న చేపలకు సైతం హాని చేయదు. అవి దాని పక్కనే ఆడుకుంటూ కనిపిస్తాయి. భక్తులు చేయించిన పొంగలి ప్రసాదాన్ని ఆలయ పూజారి సరస్సు ఒడ్డుకు తీసుకురాగానే బయటకు వచ్చి ఆ ప్రసాదాన్ని తింటుంది. మొసలి సహజంగా మాంసాహార జంతువు. కానీ బాబియా మాత్రం ఎన్నో ఏళ్ల నుంచి శాకాహారం మాత్రమే తింటున్నది. ఇదెలా సాధ్యం? సైన్స్ ఈ విషయాన్ని ఒప్పుకుంటుందా? అనే ప్రశ్నకు 2006లో జింబాబ్వేలో జరిగిన ఓ సంఘటన సమాధానమిచ్చింది. ఆర్థిక సంక్షోభం వల్ల మొసళ్ల చర్మాలతో వ్యాపారం చేసే ఓ కంపెనీ తమ దగ్గర ఉన్న లక్షా అరవై నాలుగు వేల మొసళ్లకు తిండి పెట్టడం కష్టమై... వాటికి మాంసంలో కాయగూరల్ని కలిపి ఉండలుగా చేసి అందించసాగింది. కొన్ని రోజుల తర్వాత మాంసాన్ని పూర్తిగా మానేసి కేవలం శాకాహారమే పెట్టసాగారు. దాంతో నెమ్మదిగా ఆ మొసళ్లన్నీ శాకాహారులైపోయాయి. అలాగే బాబియా కూడా మొదట్నుంచీ శాకాహారానికే అలవాటు పడిందేమో!

బాబియా వయసు గురించి కూడా ఇక్కడ భిన్నమైన కథనాలు వినిపిస్తాయి. కొంతమంది బాబియాకి 150 ఏళ్ల వయసు ఉండొచ్చంటే... మరికొంతమంది మాత్రం దానికి ఎనభై ఆరేళ్లని అంటారు. ఇంకో విశేషం ఏమిటంటే ఈ ఆలయ సరస్సులో ఎప్పుడూ ఒకే ఒక మొసలి కనిపిస్తుందట. ఒకవేళ ఆలయ రక్షకురాలు బాబియా చనిపోతే సరస్సులోకి మరో కొత్త మొసలి వచ్చి, బాబియా బాధ్యతలు స్వీకరిస్తుందని ఇక్కడి వారి నమ్మకం. దీని మీద ఎన్నో కథలు కూడా ప్రచారంలో ఉన్నాయి. ■






## ఫటాఫట్



- భయపెట్టే బడి?
  - చేతబడి
- కనిపించని వనం?
  - పవనం.
- వేయలేని టెంట్?
  - మిలిటెంట్.
- చీమలు కనిపెట్టలేని షుగర్.
  - బ్రౌన్ షుగర్

## అంబానీకో లేఖ



**శ్రీముఖేష్ అంబాని గార్కి,**

దయచేసి మీరు 'రిలియన్స్ - పియో' పేరుతో మద్యం వ్యాపారం లోకి రండి. మద్యం ఫ్రీగా ఇవ్వండి. కావలిస్తే స్నాక్స్‌కి ఛార్జ్ చేయండి.

ఇట్లు - ఒక మద్యపాన ప్రియుడు.

## క్యా డైలాగ్ హై



- కండల్ని పదిమందిలో ఉపయోగిస్తే రౌడీ అంటారు. అదే పదిమంది కోసం ఉపయోగిస్తే గొప్పోడంటారు.

చిత్రం : **మిస్టర్ పెళ్లికొడుకు**



- మనుషులు కలిసి బతకాలి. కంచెలు వేసుకొని కాదు.

చిత్రం : **కంచె**

### ('ప్రేమనగర్' చిత్రంలోని 'ఎవరికోసం ఎవరికోసం ..' పాటకు)

**పేరడీ**

ఎవరికోసం ఎవరికోసం
ఈ నోట్ల మార్పిడి - ఈ చిల్లర గోల
ఈ గందర గోళం - ఈ అగ్ని గుండం
ఎవరికోసం - ఎవరికోసం
ఎవరికోసం - ఎవరికోసం

పెద్దనోట్లు రద్దు చేసి ..
మా పేదోళ్లను బాధ పెట్టి



డబ్బులు లేని ఏటియమ్ముల ముందు మమ్ము నిలిపావు
జమ చేస్తే బ్యాంకుల్లో మా డబ్బు మాకు రాదు
రెండు వేల నోటుకూ చిల్లర లేదు
కూలి లేదు నాలి లేదు పగలంతా క్యూలో నిల్చున్నా
అయ్యో అనే దిక్కు లేదు మొక్కు లేదు

స్విస్ బ్యాంకుల్లోని నల్ల ధనం తెస్తానన్నావు
మేక్ ఇన్ ఇండియా నినాదమ్మై లక్షల ఉద్యోగాలన్నావు
అంబానీ మాల్యాలకు కోట్లు దోచి పెట్టావు
మీకు జనంపైన జాలి లేదు, మాకు మీరంటే భయం లేదు
మీ మాటలకు మోసపోయాము మా ఓట్లతో మార్చుతాము

**- మండవ సుబ్బారావు, 94933 35150**





**జర్నీ జర్నలిస్టుగా ప్రారంభమైనా లిటరేచర్ పట్ల మక్కువ కులశేఖర్‌ను లిరిసిస్ట్‌ని చేసింది. పదాలు కూర్చి, పాటలు అల్లి శ్రోతని మాయ చేయడం, సంగీత గమకాలకు సాహితీ సొబగును అద్దడం ఆయనకు అక్షరం నేర్పిన విద్య. అందుకే కలం కదిలించిన ప్రతి పాటా అందంగా పరిమళించింది. ఆ పరిమళాలలో కొన్ని 'నా పాట' కోసం...**

# ఏ చిలిపి కళ్లలోన కలవో...

అక్షరం అంటే నాకు చిన్నప్పటి నుంచి ఇష్టం. నా ఆట, పాట అన్నీ దానితోనే. మా గురువులు కూడా మాచేత అలా ఆడిస్తూనే సాహిత్యామృతాన్ని తాగించారు. అప్పుడప్పుడే కవిగా మిత్రబృందంలో పేరు తెచ్చుకుంటున్న సమయంలో జరిగిన ఓ సంఘటన నేను సినీ గేయ రచయితగా మీముందు నిలబడటానికి కారణమైంది. చాన్నాళ్ల క్రితం ఆంధ్రా యూనివర్సిటీలో జరిగిన ఓ కవితాగోష్ఠిలో నేను -

**ఏమిచ్చిందోగాని ఇంతోటి లంచం**
**కన్నయ్య తలనెక్కింది ఈ నెమలి పింఛం**
**అమ్మలాగ లాలించిందా... అమృతాన్ని తాగించిందా...**
**పాలబువ్వ తినిపించిందా.. వేలుపట్టి నడిపించిందా..**
**ఏమిచ్చిందో**

అనే కవిత చదివి వినిపించాను. ఆ సభకు విచ్చేసిన వారిలో ప్రసిద్ధ సినీ గేయ రచయిత సిరివెన్నెల గారు కూడా ఉన్నారు. కవిత చదవడం పూర్తయిన తర్వాత వేదిక దిగి వస్తుంటే నన్ను ఆపి అభినందించి, సినిమా పాటలు రాయవయ్యా అని సలహా ఇచ్చారు.

నా పాట...33

హైదరాబాద్‌లో కొన్నాళ్లు జర్నలిస్టుగా పనిచేసిన తర్వాత సినిమాల్లోకి వచ్చాను. తేజ, ఆర్పీ పట్నాయక్, నేను కలిసి చేసిన సినిమాలు సూపర్ హిట్టై మా కాంబినేషన్‌కు మంచి పేరు తెచ్చిపెట్టాయి. మేం ముగ్గురం కలిసి చేసిన మొదటి సినిమా 'చిత్రం'. ఆ సినిమాలో నాకు అవకాశం రావడమే గమ్మత్తుగా జరిగింది. ఆ సినిమాలో 'కుక్క కావాలి' అనే పాట కోసం చాలామందితో లిరిక్స్ రాయించినా ఎవరిదీ నచ్చలేదట తేజగారికి. అప్పటికే నాకు సంగీత దర్శకులు ఆర్పీగారితో పరిచయం ఉంది. నా కవితలు చదివిన ఆర్పీగారు ఆ పాట నేను రాయగలనని తేజగారితో చెప్తే ఆయన నన్ను తీసుకురమ్మన్నారు. సందర్భం చెడకుండా పాటలో రామాయణ, భారత, బాలనాగమ్మల స్టోరీని ప్రస్తావిస్తూ... చివర్లో కుక్క ప్రస్తావన తీసుకురావడం ద్వారా నవ్వు పుట్టించేలా రాశాను. ఆయనకది విపరీతంగా నచ్చి, సినిమాలోని మిగతా పాటలన్నీ కూడా రాసే అవకాశమిచ్చారు. అన్నీ హిట్టే.

ఆర్పీ సంగీత దర్శకత్వంలో నేను ఎన్నో హిట్ పాటలు రాసినా, నాలోని కవికి నిజమైన సవాలు విసిరిన సందర్భం 'శీను వాసంతి లక్ష్మి' సినిమాలో వచ్చింది. ఈ సినిమాలోని కథానాయకుడు ప్రకృతి ఒడిలో కూర్చుని స్వతఃసిద్ధంగా సంగీతం నేర్చుకున్నవాడు. అలాంటి వాడికి శాస్త్రీయ సంగీతంలో ఉద్దండుడైన వ్యక్తితో పోటీ పడాల్సిన సందర్భం వస్తుంది. ఆ సందర్భానికి పాట రాయాలి. రాశాను గానీ నాకే సంతృప్తి అనిపించలేదు. మళ్లీ రాశాను. అలా అయిదు, పది కాదు... దాదాపు వంద వెర్షన్లు రాసుకున్నాను. చివరికి పాట రెడీ అయింది. ఆ పాటలో -

**పాడనా శిలను కరిగించు గీతం**
**పరమేశ్వరుడే ఇలకేతెంచి నర్తించు నవనాట్యవేదం...**

అని సంగీత స్రష్ట పాడితే, దానికి బదులుగా కథానాయకుడు

**పాడనా మదిని మురిపించు గీతం**
**స్వరమాధురిలో మనసే నెమలై పురివిప్పి ఆడేటి ఆనంద గీతం**

అని పాడతాడు. ఈ ఇద్దరూ పాడిన పాదాలను గమనిస్తే... తన విద్వత్తు మీద మితిమీరిన ఆత్మవిశ్వాసం ఒకరిదైతే... శ్రోతల్ని మురిపించేదే నిజమైన సంగీతం అనే నమ్మకం మరొకరిది. అలా పాటలోనే వాళ్ల వ్యక్తిత్వాలను పరిచయం చేశాను. ఈ పాటలో మరో చోట కథానాయకుడు -

**మందార మకరంద మాధుర్యపానం... నా గానం**
**తుమ్మెద ఝుంకారం... నా పాటకి శ్రీకారం**
**పరువాల పరవళ్ల సెలయేటి వేదం... నా రాగం**




అని పాడతాడు. గమనిస్తే ఇందులో నేను వాడిన విశేషాలన్నీ ఘ్రాణ, శబ్ద ప్రధానమైనవి. అలా రాయడానికి కారణం కథానాయకుడు గుడ్డివాడు. అతడు వాసన చూసి లేదా శబ్దాన్ని విని మాత్రమే ప్రకృతిని ఆస్వాదించగలడు. అతడు గుడ్డివాడు కాకపోయి ఉంటే రంగుల వర్ణనకే ప్రాధాన్యతనిచ్చేవాడిని. ఆ పాదాలు వినడంతోటే సంగీత స్రష్టకు కోపమొచ్చి 'కళాభారతికి కశాఘాతమిది ఏమిర నీ గీతం' అంటాడు. ఇక్కడ 'కశాఘాతం' అంటే కత్తిపోటు. ఈ పద ప్రయోగం వాల్మీకి 'రామాయణం'లో మనకు కనిపిస్తుంది. ఈ పాటకు అనేకమంది సాహితీవేత్తల ప్రశంసలు లభించాయి.

### బాపుగారి ప్రశంస

'పాడనా శిలలు కరిగించు గీతం' పాట నాలోని కవిని సంతృప్తి పరిస్తే... 'ఘర్షణ' సినిమాలో 'ఏ చిలిపి కళ్లలోన కలవో' పాట నాలోని గీత రచయితను సంతృప్తి పరచింది. బోనస్‌గా నాకు బాపు



గారి ప్రశంసలూ దక్కాయి. గౌతమ్ మీనన్ దర్శకత్వంలో వచ్చిన ఈ సినిమాకు మ్యూజిక్ డైరెక్టర్ హ్యారిస్ జైరాజ్. నాకు ట్యూన్ ఇచ్చిన తర్వాత "లెంగ్త్‌లో ఏదైనా ఇబ్బంది ఉందా? మార్చమంటారా?" అని అడిగేవారు. ఈ పాటకు నేపథ్యం... ఎడారిలా భారంగా సాగిపోతున్న జీవితంలోకి ఒయాసిస్సులా వచ్చిన ఓ అమ్మాయి గురించి కథానాయకుడు పాడుకునే పాట. అందుకే పాటను -



హ్యారిస్ జైరాజ్

**ఏ చిలిపి కళ్లలోన కలవో... ఏ చిగురు గుండెలోన లయవో**

**నువ్వు అచ్చుల్లోన హల్లువో... జడకుచ్చుల్లోన మల్లెవో**

అని మొదలుపెట్టాను. ప్రారంభంలోనే అచ్చుల్లో హల్లు ఏమిటి మాస్టారూ అని అడిగిన వారున్నారు. అచ్చులన్నీ ఒకచోట కుప్పగా పోస్తే పదం కాదు. ఆ అచ్చుల్లో ఒక హల్లుండాలి. అప్పుడే పదం పుడుతుంది. అంటే అచ్చు ప్రియుడైతే... హల్లు ప్రియురాలు అన్నమాట. మరి ప్రియుడు-ప్రియురాలు కలిస్తేనే కదా ప్రేమకు అస్తిత్వం. గాయకుడు కబీర్ రఫి తెలుగువాడు కాకపోయినా తప్పులు లేకుండా బాగా పాడారు. ఇదే పాటలో బాపుగారికి నచ్చిన ఎక్స్‌ప్రెషన్స్ ఏవంటే -



కబీర్ రఫి

**ఆ పరుగులలో పరవళ్లు... తూలే కులుకులలో కొడవళ్లు**

**నిన్ను చూసి వంగుతుంది ఆశపడి ఆకాశం**

**ఆ మబ్బు చీర పంపుతుంది మోజు పడి నీకోసం**

ఈ పాట వచ్చాక చెన్నైలో ఓ ప్రింటింగ్ ప్రెస్‌లో నేను కనిపించగానే దగ్గరకు పిలిచి "ఎలా వచ్చిందిరా నీకా థాట్ అని అడిగారు. "ఆ రోజుల్లో కాళిదాసు మేఘంతో సందేశం పంపగా లేనిది, నేనీ రోజుల్లో ఆకాశాన్ని వంచలేనా, మబ్బుతో చీర పంపలేనా గురువు గారూ" అన్నాను. ఆయనతో అన్నట్టుగానే నేను ఉన్న భావాల్నే కొంచెం సృజనాత్మకతతో కొత్తగా చెప్తున్నానంతే! దీని గురించి ఇంకో మాట కూడా చెప్పాలి - ఒకసారి మా గురువుగారు "భాష బియ్యం లాంటిదిరా! ఇంట్లో పాతికకేజీల బియ్యమున్నా... ఏ రోజుకారోజు వేడివేడిగా వండుకు తిన్నట్టే.. భాషా భాండాగారాన్ని దగ్గర పెట్టుకుని ఎప్పుడూ కొత్తగా భావాల్ని ఆవిష్కరిస్తూ ఉండాలి" అన్నారు. ఆ మాటనే నేను ఇప్పటికీ పాటిస్తున్నాను.

**(మరిన్ని విశేషాలు వచ్చేవారం)**

# 'సోషల్' లైబ్రరీ



ఓ రాజకీయ గొడవ టౌన్ లైబ్రరీని అగ్నికి ఆహుతి చేసింది. ఆ పుస్తకాల బూడిదలోంచి అక్షరం విత్తనమై మొలిచింది. సోషల్ మీడియా సాయంతో రెట్టింపు బలాన్ని సంతరించుకుంది. తనను తగులబెట్టిన వాళ్లను పరిహసిస్తూ... టౌన్ లైబ్రరీ 'సోషల్ లైబ్రరీగా నూతన ప్రస్థానాన్ని ఆరంభించింది. ఇదంతా ఎలా సాధ్యమైందంటే..

కేరళలోని తాలూక్కరా గ్రామంలోని ఎకెజి మెమోరియల్ లైబ్రరీ... ఎంతోమంది విద్యార్థులకు, ఉద్యోగార్థులకు, సాహితీప్రియులకు చిరునామాగా ఉండేది. స్థానిక గొడవల్లో మార్చి 23, 2016న ఆ లైబ్రరీకి ఎవరో నిప్పు పెట్టారు. అయిదువేల పుస్తకాలు, విలువైన రాతప్రతులు, సంగీత వాయిద్యాలు కాలి బూడిదయ్యాయి. సుమారు నలభై లక్షల రూపాయల ఆస్తికి నష్టం వాటిల్లింది. ఈ సంఘటన లైబ్రరీ రెగ్యులర్ రీడర్స్‌ని ఆవేదనకు గురి చేసింది. ఆ ఆవేదనలోంచి ఎలా అయినా లైబ్రరీకి మళ్లీ పూర్వ వైభవం తీసుకు రావాలన్న ఆలోచన జనించింది. సామాజిక మాధ్యమాలను అందుకు ఉపయోగించుకున్నారు.

కొంతమంది వాలంటీర్లుగా ముందుకు వచ్చి సోషల్ మీడియాలో క్యాంపెయిన్ నిర్వహించారు. 'ఫేస్‌బుక్‌లో 'బుక్ కలెక్షన్' అనే గ్రూపుని క్రియేట్ చేశారు. ఈ క్యాంపెయిన్‌కి పెద్దఎత్తున స్పందన వచ్చింది. చాలామంది తమ సొంత కలెక్షన్‌లోని కొన్ని పుస్తకాలను లైబ్రరీకి ఇవ్వడానికి ముందుకొచ్చారు. అలా దాతలు ఇచ్చిన పుస్తకాలు పదులు, వందలు దాటి పదివేలకు చేరాయి. దాతల దగ్గరకెళ్లి పుస్తకాలను తీసుకోవడానికి వాలంటీర్లు ఓ వాహనాన్ని ఏర్పాటు చేశారు. దానికి 'బుక్ వెహికల్' అని పేరు పెట్టారు. కేరళ రాజధాని తిరువనంతపురం నుంచి బుక్ వెహికల్ ప్రయాణం మొదలు పెట్టింది. పుస్తక దాతలతో సమన్వయం కోసం ప్రతి జిల్లాలోను లైబ్రరీ తరపున వాలంటీర్లు పనిచేశారు.



ఒక్క కేరళ రాష్ట్రం నుంచే కాదు... ఇతర రాష్ట్రాల విశ్వవిద్యాలయాల నుంచి కూడా ఈ లైబ్రరీకి పుస్తకాలు వచ్చి చేరాయి. ఢిల్లీ యూనివర్సిటీ, హైద్రాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ, జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ తమ వంతుగా కొన్ని పుస్తకాలు అందించాయి. అమెరికా, బ్రిటన్, మధ్య ప్రాచ్య దేశాలు సైతం ఈ గ్రంథాలయానికి పుస్తకాలు ఇవ్వడానికి ముందుకొచ్చాయి. కొంతమంది ఆన్‌లైన్ బుక్‌స్టోర్స్ నుంచి పుస్తకాలు కొనుగోలు చేసి పంపారు. మరికొంతమంది నేరుగా లైబ్రరీ బ్యాంక్ అకౌంట్‌లో డబ్బులు జమ చేశారు. అలా లైబ్రరీ ఫండ్ ఏర్పాటైంది. ఆ సొమ్మంతా అగ్ని ప్రమాదంలో దెబ్బతిన్న గ్రంథాలయ భాగాన్ని బాగు చేయడానికి వినియోగించనున్నట్టు చెప్పారు వాలంటీర్లు. ■




కవర్ స్టోరీ

**ఇప్పుడు ఏ ఇంట్లో చూసినా ఒకటే ముచ్చట... మన దగ్గర ఎంత బంగారం వుంది? యాభై తులాలకంటే ఎక్కువ వుందా? అందులో మనం కొనుక్కున్నది ఎంత? పుట్టింటివాళ్లు, మెట్టినింటోళ్లు పెట్టింది ఎంత? వాటికి బిల్లులున్నాయా అని అత్తారింటోళ్లను ఇప్పుడు అడిగితే ఏమన్నా బావుంటుందా?... ఇలా రకరకాల సంశయాలు, చర్చలు.**



**ఇంతకు ముందు నగలు ధరించి బయటికి వెళ్లాలంటే చైన్ స్నాచర్ల భయం ఒక్కటే వుండేది. ఇప్పుడు ఐటీ స్నాచర్ల భయం కూడా పట్టుకుంది.**



**మరోవైపు... బంగారం తిక్క కుదిరింది. ఈ దెబ్బకు బంగారం కొనుక్కునే వాడే వుండడు. తులం బంగారం రేటు పదివేలకు పడిపోవడం ఖాయం. బంగారం కొట్లు మూతపడడం గ్యారంటీ... అని అనుకుంటున్న వాళ్లూ వున్నారు.**

# బంగారం భగభగలు

ఈ కోల్డ్ సీజన్‌లో ఇది నిజంగానే హాట్ టాపిక్. కేంద్ర ప్రభుత్వం బోలెడంత వివరణ ఇచ్చింది. అయినా ప్రజల్లో సందేహాలు నివృత్తి కాలేదు. ఏమో... పెద్ద నోట్ల రద్దు గురించి కలగన్నామా? అలాగే బంగారంపై సర్జికల్ స్ట్రయిక్ జరగదని గ్యారంటీ ఏముంది? పైగా ఇది తొలి అడుగు మాత్రమేనని, మరిన్ని చర్యలు తీసుకుంటామని ప్రధానమంత్రి నరేంద్ర మోదీ స్వయంగా చెప్పారు. అయినా సరే అనేక సందేహాలు సామాన్యులను పట్టిపీడిస్తున్నాయి.

నిజానికి ప్రభుత్వం బంగారంపై కొత్తగా ఆంక్షలు ఏమీ విధించలేదు. అనేక సంవత్సరాలుగా అమల్లో వున్న నియమ నిబంధనలే ఇప్పుడు కూడా కొనసాగుతున్నాయి. ఆదాయపు పన్ను శాఖ వాళ్లు ఇంటింటికీ వెళ్లి తనిఖీ చేసి ఎంత బంగారం వుందనే లెక్కలు తీయరు. ఆదాయానికి మించిన అక్రమార్జన వున్నట్లు తమ దృష్టికి వచ్చిన సందర్భాలలో మాత్రమే ఎంత బంగారం వుందనేది లెక్కతీస్తారు. అలా లెక్క తీసేటప్పుడు ఒక్క బంగారం గురించి మాత్రమే కాదు, అన్ని ఆస్తుల వివరాలు సేకరిస్తారు.

### అమల్లో వున్న చట్టం ఏం చెబుతోంది?

అవినీతితోనో, మరో రూపంలోనే కూడబెట్టిన సంపదను ఏసీబీ, ఐటీ అధికారులు పట్టుకున్నప్పుడు ఇన్ని కోట్ల డబ్బు, ఇన్ని కిలోల బంగారం దొరికిందని, స్వాధీనం చేసుకున్నారని మీడియాలో వార్తలు వస్తాయి. మొత్తం డబ్బు, బంగారాన్ని అధికారులు స్వాధీనం చేసుకున్నా, అందులో కొంత బంగారాన్ని తమ వద్దనే వుంచుకునే వెసులుబాటు టాక్స్ ఎసెసీలకు వుంది. సెక్షన్ 132(4) ప్రకారం ఎసెసీ భార్యకు 500 గ్రాముల వరకు మినహాయిస్తారు. అలాగే అవివాహితకు 250 గ్రాముల బంగారం కలిగి వుండడానికి మినహాయింపు వుంది. పురుషుడు 100 గ్రాముల బంగారం వరకు కలిగి వుండవచ్చు. వీటికి లెక్కలు చెప్పాల్సిన అవసరం లేదు. స్థూలంగా చెప్పాలంటే... చిన్న కుటుంబంలో భార్యాభర్తలకు కలిపి 600 గ్రాముల బంగారం వుండవచ్చు. అంటే అరవై తులాలు. సాధారణ మధ్యతరగతి కుటుంబాలలో ఇంతకు మించి బంగారం వుండడం అరుదు.

### 'పసిడి' సందేహాలు ...

ఒకవేళ మధ్యతరగతి కుటుంబాల దగ్గర అరవై తులాలకు మించి వుంటే, ఆ మిగిలినదంతా ప్రభుత్వం లాగేసుకుంటుందా? మరో పెద్ద సందేహం.

ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమిటంటే... అరవై తులాలకు మించి ఉంటే కూడా ప్రభుత్వం దాన్నేమీ లాక్కోదు. పరిమితికి మించిన బంగారాన్ని ఎలా సమకూర్చుకున్నారో ప్రభుత్వం అడిగినపుడు వివరణ ఇవ్వాలి. అది వారసత్వంగా వస్తున్న బంగారం కావొచ్చు.

**బంగారానికి శతాబ్దాల చరిత్ర వున్నప్పటికీ, ఇప్పుడు చెలామణిలో వున్న బంగారంలో 75 శాతం గత వందేళ్లలో తవ్వింది.**



కష్టార్జితాన్ని పొదుపు చేసుకుంటూ అప్పుడప్పుడూ కొంత చొప్పున కొనుగోలు చేసినది కావచ్చు. ఆ వివరాలను అందజేస్తే సరిపోతుంది. అయితే ఇప్పటి పరిస్థితుల దృష్ట్యా ప్రతి కొనుగోలుకు పన్ను చెల్లించి బిల్లు తీసుకోవడం చాలా మంచిది.

వారసత్వంగా విల్లు ప్రకారం వచ్చిన బంగారంపై కూడా ప్రజలకు హక్కు వుంటుంది. అయితే విల్లుపై ఇద్దరు సాక్షి సంతకాలు వుండాలి. పుట్టింటినుంచో, బహుమతిగానో, మరో విధంగానో వచ్చే బంగారానికి ఆధారపత్రం ఏదన్నా వుండేట్టు చూసుకోవడం మంచిది. బహుమతిగా పొందిన బంగారాన్ని విక్రయించేటప్పుడు బహుమతిగా పొందినప్పటి ధర, ఇప్పటి ధరల మధ్య వ్యత్యాసంపై పన్ను కట్టడం లాంటి నిబంధనలు వున్నాయి.

కేంద్ర ప్రభుత్వ గోల్డ్ డిపాజిట్ స్కీమ్, 1999 ప్రకారం... 2000-01 నుంచి గోల్డ్ డిపాజిట్ బాండ్లను జ్యువెలరీ కింద పరిగణించకుండా సెక్షన్2(ఇఎ)కి సవరణ వచ్చింది. దీని ప్రకారం గోల్డ్ డిపాజిట్ బాండ్లను ఆస్తులుగా పరిగణించరు. అలాగే కేంద్ర ప్రభుత్వం ఏడాది క్రితం ప్రవేశపెట్టిన పథకం ప్రకారం మన బంగారు ఆభరణాలను బ్యాంకులలో నిర్ణీత కాలవ్యవధికి జమచేసి, దానిపై వడ్డీ కూడా పొందే అవకాశం వుంది.

బంగారానికి సంబంధించి ఇలా అనేక వెసులుబాట్లు వున్నాయి.

వ్యవసాయ ఆధారిత కుటుంబాలయితే ఈ విషయంలో చీకూచింతా లేకుండా వుండవచ్చు. ఓ పదెకరాల సాగుభూమి, పాడి కలిగిన రైతు కుటుంబం ఓ పదేళ్ల వ్యవధిలో కిలో బంగారాన్ని సమకూర్చుకోవడం అసాధ్యమైన విషయమేమీ కాదు. వ్యవసాయ ఆదాయంపై పన్ను లేనట్టే వ్యవసాయ ఆదాయంతో కొనుగోలు చేసిన బంగారంపై కూడా ఎలాంటి పన్ను వుండదు.

### మన దగ్గర సెంటిమెంట్ ఎక్కువ ...

బంగారానికీ, భారతీయులకూ విడదీయరాని బంధం ఎప్పటినుంచో ఉంది. బతికినన్నాళ్లేకాదు, చచ్చిపోయే చివరిక్షణాల్లోనూ ఒంటి మీద బంగారం వుండాలని కోరుకుంటారు భారతీయ మహిళలు. "ఈ ఆడోళ్లున్నారు చూశారూ... బంగారం పేరెత్తితే చాలు, పడిచస్తారు.. ఒళ్లు మరిచిపోతారు. వాళ్లకదో వేలంవెర్రి".... ఇలాంటి మాటలు ఇప్పుడే కాదు, ఎప్పటినుంచో వినిపిస్తున్నాయి మగాళ్లనుంచి. అయితే మహిళలు ఎగబడితేనే, పడిచస్తేనే బంగారం ధర ఇంత దాకా వచ్చిందా?

భారతదేశంలో బంగారం అంటే చాలా క్రేజ్ వున్న మాట నిజం. ప్రపంచంలో పసిడి కొనుగోళ్లలో అందరికంటే ఇండియన్లే ముందున్నారన్నది వాస్తవం. ప్రతి సంవత్సరం భారతీయులు కొనుగోలు చేస్తున్న బంగారం దాదాపు 800 నుంచి 1000 టన్నులు. అయినా సరే బంగారం ధర హెచ్చుతగ్గులకు ఇదొక్కటే కారణం కాదు. అనేక అంతర్జాతీయ రాజకీయ, ఆర్థిక, సామాజిక అంశాల ప్రభావం బంగారం ధరపై వుంటుంది. వాటి గురించి తెలుసుకుంటే చాలా ఆశ్చర్యం కలుగుతుంది.



### అసలు ఎవరి దగ్గర ఎక్కువ వుంది?

భారతీయుల దగ్గరే బంగారం ఎక్కువ వుందని చాలామంది అనుకుంటారు. అది నిజం కాదు. అధికారంగా భారతదేశం దగ్గర, రిజర్వ్ బ్యాంక్ దగ్గర వున్న బంగారం నిల్వలు చాలా తక్కువే. ప్రపంచంలో అన్ని దేశాలకంటే ఎక్కువ బంగారం వున్నది అగ్రరాజ్యం అమెరికా దగ్గరే. అమెరికా రిజర్వ్ బ్యాంక్ (ఫెడరల్ రిజర్వ్) దగ్గర 8,133 టన్నుల గోల్డ్ వుంటే, ఇండియా దగ్గర వున్నది 557 టన్నులే. అమెరికా విదేశీ మారకద్రవ్యంలో బంగారం వాటా 80 శాతం అయితే, మన విదేశీ మారక ద్రవ్యంలో బంగారం వాటా 10 శాతమే. మనతో పోల్చితే చైనా దగ్గర రెట్టింపు బంగారం వుంది.

గత కొన్ని సంవత్సరాలుగా చైనా పసిడిని ఎగబడి కొనుగోలు చేస్తోంది. మన కంటే చిన్న దేశాల దగ్గర కూడా మనకంటే ఎక్కువ బంగారం నిల్వలు వున్నాయి. బంగారం నిల్వలు అధికంగా వున్న దేశాలే సంపన్న దేశాలుగా ప్రపంచ చిత్రపటంలో వెలుగొందడం గమనించాల్సిన అంశం. బంగారం నిల్వలు ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థలను బలోపేతం చేశాయనడానికి ఇది నిదర్శనం.

**తిరువనంతపురం (కేరళ)లోని శ్రీ అనంతపద్మనాభస్వామి దేవాలయంలో ఇటీవల బయల్పడిన సంపదలో టన్నుల కొద్దీ బంగారం ఉంది. దాని వల్లే మన దేశంలో అత్యంత సంపన్న క్షేత్రంగా ఈ ఆలయం రికార్డులకెక్కింది.**



ప్రపంచ చరిత్రలో బంగారం కోసం అనేక యుద్ధాలు జరిగాయి. బంగారం కోసం స్పెయిన్ చేసిన యుద్ధాలు లోకవిదితం. అంతెందుకు... రెండవ ప్రపంచ యుద్ధకాలంలో హిట్లర్ సేనలు అనేక ఐరోపా దేశాలపైకి దండెత్తినప్పుడు.. మొదటగా స్వాధీనం చేసుకున్నది బంగారాన్నే. కొల్లగొట్టిన బంగారంతో హిట్లర్ తన సేనలను మరింత బలోపేతం చేసుకుని ముందుకు సాగాడు.

గత చరిత్రనే కాదు... వర్తమాన మానవ చరిత్రనూ, దేశాల







చరిత్రనూ బంగారం ప్రభావితం చేస్తూనే వుంది. పదేళ్ల క్రితం అమెరికా ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోయి, డాలరుకు విలువ తగ్గిపోయాక బంగారం విలువ మరింత పెరిగింది. అప్పటిదాకా డాలరు నిల్వలలో పోటీపడిన ప్రపంచదేశాలు గోల్డ్ నిల్వలను పెంచుకోవడానికి పరుగులు తీశాయి. కాబట్టే పదిహేను సంవత్సరాల క్రితం 288 డాలర్లు వున్న ఔన్సు బంగారం ధర ఒక దశలో 2000 డాలర్లదాకా దూసుకెళ్లి ప్రస్తుతం 1200 డాలర్ల దగ్గర స్థిరంగా వుంది. ప్రపంచ వ్యాప్తంగా అన్ని దేశాల కరెన్సీలపై ప్రజలకు నమ్మకం నానాటికీ సన్నగిల్లుతోంది. ముఖ్యంగా ఇంటర్నేషనల్ కరెన్సీ అయిన డాలరుపై విశ్వాసం సడలిపోతోంది. డాలర్ ప్రామాణిక ఆర్థిక వ్యవస్థలో లుకలుకలు బయటపడుతున్నకొద్దీ సురక్షిత ఆర్థిక సాధనంగా గోల్డ్ నిలుస్తోంది.

ఇప్పుడు భారతదేశంలో పెద్ద నోట్ల రద్దు తర్వాత నగదు పరిస్థితిపై అనిశ్చితి నెలకొనడంతో బంగారాన్ని మించినది మరోటి లేదనే భావన మరోసారి బలపడుతోంది.

**'టాక్ ఆఫ్ ది కంట్రీ'గా గత నెలలో జరిగిన గాలి జనార్దన్‌రెడ్డి కూతురు బ్రాహ్మిణి పెళ్లిలో పెళ్లికూతురు బంగారు చీర ఖరీదు 17 కోట్ల రూపాయలుంటుందని, ఆమె ధరించిన ఆభరణాల విలువ 98 కోట్ల రూపాయలుంటాయని ఫ్యాషన్ వర్గాలు చెబుతున్నాయి.**



### డిమాండ్ పెరగుతుందే తప్ప తగ్గదు...

సాధారణంగా ఉద్రిక్త పరిస్థితులు బంగారానికి డిమాండ్ పెంచుతాయి. టెన్షన్లు తగ్గినప్పుడు బంగారానికి డిమాండ్ తగ్గుతుంది. ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా ప్రభుత్వాలు బంగారం నిల్వలు పెంచుకుంటున్నాయి. జర్మనీ, జపాన్‌లు అమెరికా దగ్గర దాచుకున్న తమ బంగారాన్ని వెనక్కు తెచ్చుకుంటున్నాయి. నిక్సన్ హయాంలో గోల్డ్ స్టాండర్డ్ తొలగిపోయింది కానీ ఇప్పుడు మళ్లీ గోల్డ్ స్టాండర్డ్ వైపు ప్రపంచం అడుగులు వేస్తోంది. డాలర్ నిల్వలు అనేది గతించిన చరిత్ర అని చైనా అధ్యక్షుడు అన్నారు. వెనెజులా డాలర్ వదిలేసి గోల్డ్‌కి పెద్దపీట వేసింది. ఇరాన్, రష్యాలు తమ మధ్య డాలర్ లేకుండా డైరెక్ట్ ఐపోయాయి. అలాగే చైనా, బ్రెజిల్ కూడా. ఇండియాకి ఇరాన్ డాలర్ లేకుండానే ముడిచమురు ఇస్తోంది. దీని అర్థం బంగారానికి వన్నె తగ్గబోదని.

అన్నింటికంటే ముఖ్యం... బంగారం ఉత్పత్తి ఏడాదికేడాది తగ్గిపోతోంది. కొత్త గనుల అన్వేషణ దాదాపుగా లేదు. గుర్తించిన గనులను తవ్వడం లాభసాటిగా లేదు. మరోవైపు అనేక రంగాలలో బంగారం వినియోగం క్రమంగా పెరుగుతూ వస్తోంది. అంతరిక్ష ప్రయోగాలు చేయాలన్నా, స్మార్ట్ మొబైల్ ఫోన్లు తయారు చేయాలన్నా, కంప్యూటర్ మదర్ బోర్డులు తయారుచేయాలన్నా బంగారం తప్పనిసరి. ఎలక్ట్రానిక్స్ వస్తువుల తయారీలో ప్రతి సంవత్సరం ప్రపంచం ఉపయోగిస్తున్న బంగారం ఎంతో తెలుసా? మూడొందల టన్నులు. ఈ వినియోగం రానురాను మరింత పెరుగుతుంది. మొబైల్ ఫోన్ హ్యాండ్ సెట్స్‌లో వాడే గోల్డ్ కంప్యూటర్లలో కంటే ఎక్కువే.

నానో టెక్నాలజీలో బంగారం సూక్ష్మకణాలను ఉపయోగించి కొత్త ఆవిష్కరణలు చేస్తున్నారు సైంటిస్టులు. బంగారం ఇప్పటిదాకా ఆభరణాల విలువను, ఇన్వెస్ట్ మెంట్ విలువను మాత్రమే కలిగివుంది. ఇప్పుడు మరెన్నో విధాలుగా మానవాళి అభ్యున్నతికి దోహదపడుతోంది. ఆఫ్రికా దేశాలలో మలేరియా వ్యాధిని మట్టుబెట్టడానికి జరుగుతున్న ప్రయత్నాల్లో కూడా గోల్డ్ ఎంతగానో ఉపయోగపడుతోంది. మెడికల్ పరీక్షల్లో, వ్యాధి నిర్ధారణలో బంగారం తోడ్పడుతోంది. ఈ అంశాలన్నీ కూడా బంగారం ధరను ప్రభావితం చేసేవే. బంగారానికి బంగారు భవిష్యత్తు వుందని నిర్ధారించేవే.

బంగారం... ఎప్పటికీ బంగారమే.

ఇత్తడి పుత్తడి కావచ్చు కానీ, పుత్తడి ఎన్నటికీ ఇత్తడి కాదు.

**- వాసిరెడ్డి వేణుగోపాల్, 90005 28717**

## 'బంగారు' బాబులు



బంగారం అంటే కేవలం మహిళలకే పిచ్చి అనుకుంటే మీరు పొరపడినట్లే. తులాల చొప్పున కాకుండా కిలోల కొద్దీ బంగారాన్ని ఒంటిపై ధరించే మగరాయుళ్లూ ఉన్నారు. నాసిక్ వ్యాపారవేత్త, రాజకీయ నాయకుడు పంకజ్ పరఖ్ (47)కు బంగారు ఆభరణాలు ధరించడమంటే చాలా ఇష్టం. అతడి ఒంటిపై ఉంగరాలు, గొలుసులు, బ్రాస్లెట్, వాచ్, కళ్లజోడు, మొబైల్ కవర్ రూపంలో ఎప్పుడూ పది కిలోలకు తగ్గకుండా బంగారం ఉంటుంది. అంతేకాదు.. 4.10 కిలోల బంగారంతో (దాని విలువ 1.30 కోట్ల రూపాయలు) చొక్కా కూడా కుట్టించుకుని గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కాడు. పంకజ్ తన భద్రత కోసం చుట్టూ సెక్యూరిటీ గార్డులను కూడా పెట్టుకున్నాడు.

పుణెకు చెందిన వ్యాపారవేత్త, గోల్డెన్‌మ్యాన్‌గా పేరొందిన దత్తాఫుగే (48)కూడా బంగారు చొక్కా కుట్టించుకుని అందరి దృష్టినాకర్షించాడు. 'కొందరికి కార్ల పిచ్చి ఉన్నట్టే నాకు బంగారం పిచ్చి ఉంది' అని చెప్పుకునే దత్తా ఒంటినిండా బంగారంతో కనిపించేవాడు. అయితే గత జూలైలో గుర్తు తెలియని వ్యక్తులు అతడిని పుణే శివార్లలో హత్య చేశారు.





నా ఇష్టం




షేర్ మార్కెట్‌కి దారి
?


A
DPK
NCZQ


పెద్దనోట్లు రద్దయితే మాత్రం
కట్నం నెలకి పదివేలు EMI
పద్ధతిలో కడతానంటే
కుదరదు మామగారూ !!


ఫిష్ పెట్టుమ్స్ తప్పితే
ఇంకేం లేవా?
బ్లూ వరల్డ్
రెస్టారెంట్


ఏరా కాస్త పెద్ద మంట పెట్టొచ్చుగా ?




# కుబా సీ! యాంకీ నో!

**1959 జనవరి.**

**ఏలూరు పవర్‌పేటలో కొత్తపేట.**

**కృష్ణా జూట్ మిల్స్ రెండో పోరీ (షిఫ్ట్) కూత కూసి చాలాసేపయింది. నల్లటి పొగగొట్టం బూడిదలాటి పొగ చిమ్మింది. గొడ్డుచాకిరీ చేసి బయటికొచ్చిన వర్కర్స్ అంతా గట్టిగా అరుచుకుంటూ, విరగబడి నవ్వుకుంటూ, అందరూ తుళ్ళుకుంటూ పేలుకుంటూ ఇళ్ళకొస్తున్నారు. తుళ్ళుతూ రావడానిక్కారణం మిల్లుకీ ఇల్లుకీ మధ్యనుండే అప్పాయమ్మ సారాకొట్టే.**

మా ఇంటి ప్రహరీగోడ లోపల సన్నజాజి పందిరికీ, జామచెట్టుకూ మధ్య పడక్కుర్చీలో పడుకుని మా నాన్న ఏదో ఆలోచిస్తున్నాడు. ఒళ్ళో పొద్దుటి న్యూస్ పేపరుంది. వాకిట్లోకి ఒక్కొక్కళ్ళే వస్తున్నారు. పాతూరి అప్పారావు గాడూ, కొత్తూరి బలేలూ, గిడుతూరి అప్పారావూ, పొన్నాడ సూర్యనారాయణగారూ, ఇజ్జాడ ఆదినారాయణా, కుంచే అప్పారావూ, పిన్నింటి సత్తినారాయణా ఇంకా చాలామంది. రోజూ వచ్చేవాళ్ళ కంటే చాలా చాలా బోల్డు మంది వచ్చేశారు. ఏమయిందీ, ఎలాగైందీ అంటూ ఆత్రంగా ఆరాలు తీస్తున్నారు.

రష్యా, చైనాల్లో మన రాజ్యమున్నట్టే, అల్లంత దూరాన అమెరికాకు అతి దగ్గర్లో మన రాజ్యం లాంటిదే వచ్చిందని నాన్న చెప్తున్నాడు. తెలుగు పత్రికల్లో ఆ వార్తలేవీ రాలేదనీ, రేడియోలో మాత్రమే చెప్పారనీ అన్నాడు. నేను కూడా చెవులు రిక్కించి, చెడ్డీ పైకి లాక్కుంటూ దగ్గరకెళ్ళా. క్యూబా అనే పేరు వినడం అప్పుడే.

ఇంతకాలం పాలించిన నియంత బాటిస్టా తట్టాబుట్టా సర్దుకోకుండానే పారిపోయాడట. వాడు అమెరికన్ ఏజెంట్. కనక కొత్తగా వచ్చినవాళ్ళు గట్టివాళ్ళే అయుండాలి. కానీ కృశ్చేవ్, మావోల మాదిరి అనుభవం గలవాళ్ళు కాదు. ఏం చేస్తారో మరి అని నాన్న చెప్పాడు.

కొద్ది రోజులు గడిచాయి. హవానాలోకి రెండు వేపుల నుండి రెండు గెరిల్లా దళాలను నడిపించిన ఫైడల్ కాస్ట్రో, చేగువేరాల పేర్లు



జనానికి తెలిశాయి. 'ఫిడెల్' అని పలికేవాడు నాన్న. 'ఫైడల్' అనే వాళ్ళం మేము. తర్వాత వాళ్ళ ఫోటోలు చూశాం. గడ్డాలూ, మీసాలూ జుట్టుపోలిగాళ్ళలా ఉన్నారు. కానీ అందగాళ్ళు... షోకిల్లాలు. సరదాగా ఈజీగా ఉన్నారు. రష్యా, చైనా, తూర్పు యూరప్ కమ్యూనిస్ట్ నాయకుల సీరియస్ పొలిట్‌బ్యూరో మొహాలు చూసి జడుసుకుని ఉన్నామేమో, వీళ్ళని చూస్తే ముచ్చటేసింది. అప్పటి లాటిన్ అమెరికన్ జులాయిలు బర్ట్‌లంకాస్టర్, బడ్‌స్పెన్సర్ జంటల్లాగా అల్లరిగాంగ్ అనిపించి ఐడెంటిఫై అయిపోయాం.

మరికొంతకాలమైంది. వాళ్ళు తెగ స్పీచ్‌లు పీకుతున్నారు. వేలెడంత దేశమైనా ఎగిరెగిరి పడుతున్నారు అమెరికా అంటే అదురూ బెదురూ లేకుండా "సామ్రాజ్యవాదం, గీమ్రాజ్యవాదం" అంటున్నారు. బాగా లెఫ్ట్ వాసనేస్తున్నారు. కమ్యూనిస్టులు కాదుగానీ, రెండాకులెక్కువే నెమరేస్తున్నారు. గ్లామర్ బోయిస్.

కొన్ని నెలలు పోయాక అక్కడి నుండి చిన్న చిన్న బుక్‌లెట్స్ వచ్చాయి. రష్యన్ అక్టోబర్ విప్లవ మరఫిరంగిని పేల్చిన యుద్ధనౌక 'అరోరా'లో అరవయ్యో వంతు కూడా లేని 'గ్రాన్మా' అనే డొక్కు పడవలో యాభై మంది వెళ్ళి విప్లవం తెద్దామనుకోడం వెర్రా, పిచ్చా అనిపించింది. ఏ పిచ్చీ లేకుండా విప్లవాలెక్కడొచ్చి ఛస్తాయిలెమ్మని సరిపెట్టుకున్నాం. పైగా వీళ్ళు మనలా కాదు. లాటిన్ అమెరికన్లు. కౌబోయ్ సినిమాల్లోని కౌబోయ్‌ల్లాగా వీరికి తెంపరితనం అతి. వెనకా ముందూ చూసుకోకుండా దూకుడుగా పోతారు. లేపోతే మొంకాడా గారిజన్ మీద దాడి చేసిన అందర్నీ ప్రభుత్వం చంపేసి, పట్టుమని పుంజీడు మంది కూడా వెనకలేని కాస్ట్రోని జైల్లో పెట్టి కోర్టుకు తీసుకొస్తే బోనులో నించుని 'హిస్టరీ విల్ ఎబ్జాల్వ్ మీ' అంటూ గంటకు పైగా లెక్చర్ పీకడమంటే అతను ఎట్లాంటి మనిషనుకోవాలి? ఇలాటి వాళ్ళకి దారి చూపిన తొలి వీరుడు జోసే మర్తి ఆదర్శమే వారిని ఇట్లా నడిపించేదేమో.

విప్లవం వచ్చిన మూడేళ్ళకే అమెరికాతో ఎకాయెకీ ఢీకొట్టే డేంజరొచ్చింది. సోవియట్ యూనియన్ ఉంది గనక హవానా చుట్టూ మిస్సైల్ వలయం పెట్టింది. అప్పుడు ఆంధ్రపత్రిక వీక్లీలో 'వూమెన్' (కేరళ కార్టూనిస్టు) బొమ్మలొచ్చేవి. భూగోళాన్ని బాంబులా వేసి రెండు వేపులా ఉన్న ఒత్తులకు కృశ్చేవ్, కెనడీ నిప్పంటిస్తున్న బొమ్మ ఒకటి వేశాడతను. నిజంగా ప్రపంచం మూడో యుద్ధం అంచుకి చేరిందప్పుడు.

మా చెడ్డీ ఫ్రెండ్సూ మేమూ పెద్ద పెద్ద చర్చలు చేసేవాళ్ళం. అరేయ్ అమెరికా ఇప్పుడు క్యూబా మీద రాకెట్లు పేల్చాలంటే పక్కనే గనక చాలా ఈజీ. మరి క్యూబా? అంత దూరాన రష్యా నుంచి రాకెట్లు వేయాలంటే చాలా లేటైపోదూ అని ఒక సందేహం. రష్యా నుంచెందుకురా హవానా చుట్టూ పెట్టిన రాకెట్లే వాషింగ్టన్‌నీ, న్యూయార్క్‌నీ కొడతాయి అని మరో యుద్ధ తంత్రజ్ఞుడు

విడమర్చడం... ఇలా ఉండేవి మా కబుర్లు.

తర్వాత్తర్వాత ఈ వివాదాలూ, వివరాలూ గ్రాన్మా పత్రికలో వచ్చేవి. కాని ఏలూరులో గ్రాన్మా చూడ్డమెలా? దారుంది. టౌన్ కమ్యూనిస్టు పార్టీ ఆఫీసుకి ఈ పత్రిక రాకపోయినా 'స్వర్ణలత' అనే వీక్లీ ఎడిటర్ అర్జా సూర్యనారాయణగారి ఆఫీసుకి వచ్చేది. ఆయన నిఖార్సయిన కాంగ్రెసాయన. కానీ కాస్ట్రో అంటే వల్లమాలిన ప్రేమ. గ్రాన్మా డైలీ పేపర్ సైజులోనే ఉండేది. లావుపాటి ఎరుపు, నలుపు చారలతో మేకప్ బావుండేది. మాస్కో నుంచి వచ్చిన వాళ్ళు తెచ్చే 'ప్రావ్దా, ఇజ్వెస్తియా' చూస్తే లెనిన్ కాలం నుండి ఇప్పటికీ ఏ మార్పూ లేకుండా నీరసంగా కనిపించేవి.




సోవియట్ల సపోర్టూ, వాళ్ళు చక్కెర కొనకపోతే గడిచే స్థితి లేకపోయినా, ప్రపంచ విప్లవ పంథాలో కాస్ట్రో, చే దృష్టి వేరే. 'అరడజను వియత్నాంలు సృష్టించండి, అమెరికాను ఆ ఊబిలోకి లాగండి' అనేది వీళ్ళ నినాదం. సోవియట్, భారత కమ్యూనిస్టు పార్టీలలో ఇది సరైన పద్ధతి కాదనే ధోరణి ఉండేది. కానీ ఏమంటారు? ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలోని పేద దేశాల విప్లవాలకు సాయం చేయాలని అందరూ అనుకున్నా చేగువేరా మొజాంబిక్ వెళ్ళి అక్కడి గెరిల్లాలతో కలిసి పోరాడడం, చివరికి బొలీవియా వెళ్ళడం రష్యన్‌లకు నచ్చలేదు. నచ్చకపోయినా వీళ్ళిద్దరూ సేనల్ని పంపి పోరాడి తెల్లరంగు అహంతో విర్రవీగిన దక్షిణాఫ్రికా వాళ్ళ దుంపతెంచారు.

మా ఎమ్మెల్యే అత్తలూరి సర్వేశ్వరరావుగారొకసారి నన్ను పిలిచి "ఇదిగో నీకో స్పెషల్ ప్రెజెంటేషన్" అంటూ 'ట్రై కాంటినెంటల్' మాగజైన్ ఇచ్చారు. మన 1/8 డెమ్మీ నవలల సైజులో పంచరంగుల అట్టతో చాలా అందంగా ఉంది అది. రెణ్ణెల్లకో, మూణ్ణెలకో ఒకసారి వస్తుందా పత్రిక. 150 పేజీల పైనే... లోపల బోలెడు ఫోటోలు. 'అర్బన్ గెరిల్లా వార్ ఫేర్ చేయడమెలా? అనే చిట్కాలు. అల్జీరియన్ స్వతంత్ర పోరాటం అనుభవాలు. ఎగిరి గంతేశాం.

మా ఎమ్మెల్యేగారే ఇంకోసారి పిలిచి 'చేగువేరా' బొలీవియన్ డైరీ కాపీలు రాబోతున్నాయి, నీకూ, నీ ఫ్రెండ్స్ అందరికీ ఇస్తానన్నారు. చాలాకాలం ఎదురుచూడగా చూడగా వచ్చాయి. పాకెట్లు విప్పి చూశాం. అడ్డంగా అరిచేయంత, జానెడు పైనే పొడుగ్గా ఉన్న నల్ల కవరు లోపల పల్చటి తెల్లటి ఉలిపిరి కాయితాల మీద ప్రింట్ చేసిన అక్షరాలు. తీరా చూస్తే స్పానిష్‌లో ఉన్నాయి. ఎక్కడికో వెళ్ళాల్సిన పాకెట్ ఇక్కడి కొచ్చింది. కొన్నేళ్ళ తర్వాత గానీ ఆ డైరీలు చదవడానికి కుదర్లేదు.

నిజానికి ఈ డైరీల్లో కొన్ని కట్టుకథలు చొప్పించి, చేని భ్రష్టుపట్టించి, ప్రపంచమంతా మిలియన్ల కాపీలు అమ్మాలని అమెరికన్ పబ్లిషర్లు ప్లాన్ చేశారు. కానీ బొలీవియన్ హోంమంత్రి వీటిని రహస్యంగా, భద్రంగా కాస్ట్రోకి పంపించాడు. క్యూబాలోని ప్రింటింగ్ ప్రెస్‌లన్నీ పగలూ రాత్రీ పనిచేసి ప్రపంచమంతటా మిలియన్ల కాపీలను ఉచితంగా పంచాయి.

వియత్నాం, క్యూబాలు అమెరికాతో ముఖాముఖీ పోరాడుతున్నప్పుడు నిక్సన్ నేరుగా వెళ్ళి మావోను కలుసుకున్నాడు. అది చూసి వీళ్ళు కంగుతిన్నారు. అసలే రష్యా - చైనా విభేదాల మధ్య తంటాలు పడుతుంటే, అమెరికా వెళ్ళి చైనాతో జట్టు కట్టడం వీళ్ళ ప్రాణాల మీదికొచ్చింది. ఇక జాతీయ విముక్తి పోరాటమూ, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరూ... వాటి గతేంగాను! ఇలాటి కష్టాలన్నిటి నుంచీ క్యూబాను కాస్ట్రో కాపాడుకుంటూ వచ్చాడు. కృశ్చేవ్, మావో, నిక్సన్ ఎవరితోనూ బేరాలాడుకోలేదు. చిన్న దేశమైనా, వనరుల్లేకపోయినా తలకు మించిన భారమెత్తుకున్నాడు.

'కుబా సీ! యాంకీ నో! (క్యూబా ఎస్, అమెరికా నో) నినాదాన్ని వాల్ రైటింగ్‌లో లాగా భూగోళం మీద పెద్ద బ్రష్‌తో ఎర్ర రంగుతో రాసిపెట్టి పోయాడు.

**- మోహన్,** 85019 61684

## మందహాసం

### ఇదిగో బంగారం నిన్నే!

ఇంట్లో బంగారం అరకిలో కంటే ఎక్కువ ఉంటె తీసుకుపోతాం .. అని ప్రభుత్వం ప్రకటించినప్పటి నుండి చాలామంది వాళ్ల భార్యలను బంగారం అని పిలవడం మొదలు పెట్టారట.

**- వాట్సప్ నుంచి**

### అరెస్టు చేస్తారేమో!

'మా ఆయన బంగారం' సినిమా లోని హీరోని అరెస్టు చేస్తారేమో వంద గ్రాములకు మించి బరువు ఉన్నాడని!

**- శ్రీశైల్‌రెడ్డి పంజుగుల**



### బంగారు కోడి పెట్ట!

నా కోడి రోజూ ఒక బంగారు గుడ్డు పెడుతోంది. టాక్సేస్తారా?

**- కార్టూనిస్టు రాజు**

### మోదీజీ మీరు బంగారం!

"మోదిని అభినందించకుండా ఉండలేకపోతున్నారా .. "

"ఎందుకూ?"

"చీటికి మాటికి మా ఆవిడ ఎదురింటాళ్లకి అంత బంగారం ఉంది .. ఇంత బంగారం ఉంది అని నన్ను కాల్చుకుతినేది. నిన్నట్నుంచి నోరు మెదిపితే ఒట్టనుకో!"

### పది చీరలే ముద్దు!

మోదీ గారూ .. బంగారం గురించి మీ ఆలోచన చాలా బాగుంది. అలాగే ఆడవారు ఏడాదికి 10 చీరలకంటే ఎక్కువ కొనకూడదనే చట్టం తీసుకురాగలరని ప్రార్థన.

**- ఇట్లు భార్యాబాధితులు**

# ఫాలో అవుతారు జాగ్రత్త!

రియల్ క్రైమ్ కహానీ - 31

**విజయవాడ పడమట పోలీస్‌స్టేషన్...**

**ఫోన్ రింగయ్యింది.**

**రిలాక్స్‌డ్‌గా కూర్చున్న ఇన్‌స్పెక్టర్ రవికాంత్ ఫోన్ లిఫ్ట్ చేశారు.**

**"సార్... నా భార్య హిమబిందు కన్పించడం లేదు..." అవతలి నుంచి ఒక గొంతు ఆందోళనగా వినిపించింది.**

**ఇలాంటి ఫిర్యాదులు పోలీస్‌స్టేషన్‌కు తరచూ వస్తూనే ఉంటాయి. పెళ్లయిన తర్వాత కూడా అక్రమ సంబంధాలు పెట్టుకుని ప్రియుడితో లేచిపోవడం, భర్తలు కంప్లయింట్స్ ఇవ్వడం... ఇలాంటి కేసులు ఎన్నో.**



"సార్... ఆమె ఫోన్ కూడా స్విచాఫ్ అయ్యింది..."

"ఇంతకీ ఎప్పటి నుంచి కనిపించడం లేదు..." రొటీన్‌గా ప్రశ్నించారు ఇన్‌స్పెక్టర్.

"ఉదయం నేను బ్యాంకుకు వెళ్లే సమయంలో ఇంటి బయటకు వచ్చి మరీ టాటా చెప్పింది. మధ్యాహ్నం భోజనానికి వెళ్లేసరికి ఇంట్లో కనిపించలేదు. బీరువాలో చీరలు, నగలు కూడా కనిపించడం లేదు. ఆమె వేసుకునే చెప్పులు కూడా లేవు..."

"అలాగా... మా కానిస్టేబుల్‌ని పంపిస్తున్నాను వివరాలు చెప్పండి" అని అడ్రస్ తెలుసుకుని ఫోన్ పెట్టేశారు ఇన్‌స్పెక్టర్ రవికాంత్.

•••

కొద్దిసేపటికే ఇద్దరు కానిస్టేబుళ్లు బ్యాంక్ మేనేజర్ సాయిరాం ఇంటికి వెళ్లారు.

ఎంటీఎస్ అపార్ట్‌మెంట్‌లో నివసిస్తున్న సాయిరాం 'సప్తగిరి గ్రామీణ బ్యాంకు'లో మేనేజర్‌గా పనిచేస్తున్నారు.

కానిస్టేబుల్స్ వివరాలు సేకరించడం ప్రారంభించారు. సాయిరాం చెప్పిన వివరాల ప్రకారం... ఆయనకు భార్య, ఇద్దరు పిల్లలున్నారు. ఒక కొడుకు చెన్నైలో చదువుకుంటున్నాడు. కుమార్తె కాలేజీలో చదువుతోంది. ఎప్పటిలాగే ఆ రోజు కూడా కుమార్తెను కాలేజీకి, భర్తను బ్యాంకుకు పంపించింది నడివయస్కురాలైన హిమబిందు. ఆ తర్వాత నుంచి ఆమె కన్పించడం లేదన్న విషయం తెలుసుకున్నారు. మిస్సింగ్ కేసుగా రాసుకుని "సరే... ఎంక్వయిరీ చేస్తాం" అంటూ వెళ్లిపోయారు కానిస్టేబుల్స్.

•••

సాయిరాం ఆమె ఫోన్‌కు కాల్స్ చేస్తూనే ఉన్నాడు. కానీ నో రెస్పాన్స్...

ఆ రాత్రంతా తండ్రీ కూతుళ్లు ఆమె జాడ కోసం తీవ్రంగా ప్రయత్నించారు. అయినా ఫలితం లేకపోయింది.

ఆ మర్నాడు చెన్నైలో ఉన్న కొడుకు సెల్‌ఫోన్‌కు హిమబిందు నెంబర్ నుంచి ఫోన్ వచ్చింది.

"మీ అమ్మ నాతో పాటు వచ్చేసింది. మేమిద్దరం కలిసి ఉండాలనుకుంటున్నాం" అని ఆ ఫోన్‌కాల్ సారాంశం. వెంటనే తండ్రికి ఆ విషయం చెప్పాడా కుర్రాడు.

కొడుకు చెప్పిన విషయం విని సాయిరాం నిర్ఘాంతపోయాడు. పాతికేళ్ల సంసారంలో హిమబిందు ప్రవర్తనను తాను ఎప్పుడూ శంకించలేదు. అలాంటిది... ఇదేంటీ... ఇలా జరిగింది. 'నేను నమ్మనుగాక నమ్మను' అనుకుంటూనే తన కొడుక్కు ఫోన్ వచ్చిన విషయాన్ని పోలీసులకు తెలిపాడు సాయిరాం.

"మిస్సింగ్ కేసులన్నీ ఇలాగే ఉంటాయి. ఈ విషయం మాకు ముందే తెలుసు..." అంటూ పోలీసులు తమదైన భాషలో చులకనగా మాట్లాడారు.

వారి మాటలతో సాయిరాం మనసు చివుక్కుమంది. అసలే భార్య కనిపించడం లేదనే బాధలో ఉన్నాడు. మళ్లీ ఆమె ఫోన్‌కు కాల్ చేసినా స్విచ్ఛాఫ్ అనే వస్తోంది.

" సార్... నా భార్య అసలు ఎక్కడుందో తెలుసుకోండి... ఆమె తనంతట తాను వెళ్లిందా? ఎవరైనా బలవంతంగా తీసుకెళ్లారా? అసలామె సురక్షితంగానే ఉందా? అన్న విషయం తెలిస్తే కానీ నా మనస్సు శాంతించదు" అని ప్రాధేయపడ్డాడు సాయిరాం.

"సరే.. ఇన్వెస్టిగేట్ చేస్తాం..." అంటూ ఫోన్ పెట్టేశారు పోలీసులు.

•••

మరో రోజు గడిచింది...

హిమబిందు జాడ తెలియలేదు. కుటుంబసభ్యులు, బంధువులు తీవ్రమైన ఆవేదనలో ఉన్న సమయంలో...

పెనమలూరు మండలం, వైకుంఠపురం గ్రామ సమీపంలోని బందరు కాలువలో ఒక మహిళ మృతదేహం కన్పించిందని స్థానికుల


**"మీ అమ్మ నాతో పాటు వచ్చేసింది. మేమిద్దరం కలిసి ఉండాలనుకుంటున్నాం" అని ఆ ఫోన్‌కాల్ సారాంశం. వెంటనే తండ్రికి ఆ విషయం చెప్పాడా కుర్రాడు.**

**కొడుకు చెప్పిన విషయం విని సాయిరాం నిర్ఘాంతపోయాడు. పాతికేళ్ల సంసారంలో హిమబిందు ప్రవర్తనను తాను ఎప్పుడూ శంకించలేదు. అలాంటిది... ఇదేంటీ... ఇలా జరిగింది. 'నేను నమ్మనుగాక నమ్మను' అనుకుంటూనే తన కొడుక్కు ఫోన్ వచ్చిన విషయాన్ని పోలీసులకు తెలిపాడు సాయిరాం.**

ద్వారా సమాచారం అందుకుని పోలీసులు అక్కడికి చేరుకున్నారు.
మృతదేహాన్ని కాలువలో నుంచి బయటకు తీసి విజయవాడ కంట్రోల్ రూంకు సమాచారం అందించారు.
విషయం తెలుసుకుని అక్కడకు వచ్చిన సాయిరాం మృతదేహాన్ని తన భార్యదిగా గుర్తుపట్టి రోదిస్తూ కుప్పకూలిపోయాడు. వెంటనే మృతదేహాన్ని పోస్టుమార్టం నిమిత్తం ఆసుపత్రికి తరలించారు పోలీసులు. పోస్టుమార్టం రిపోర్టులో వెల్లడైన విషయాలు పోలీసులను ఉలిక్కిపడేలా చేశాయి.
ఆమెపై అత్యాచారం జరిగినట్లు, ఆమెను గొంతు పిసికి హత్య చేసినట్లు, అంతకు ముందు ఆమెను తీవ్రంగా హింసించినట్లు స్పష్టం కావడంతో మిస్సింగ్ కేసు కాస్తా రేప్ అండ్ మర్డర్ కేసుగా మారింది.
ఈ విషయం మీడియాకు పొక్కడంతో గృహిణిపై సామూహిక అత్యాచారం, హత్య అంటూ వార్తలు పతాకశీర్షికన వచ్చాయి.
నిందితులను పట్టుకోవాలని, వారిని కఠినంగా శిక్షించాలని మహిళా సంఘాలు పెద్దఎత్తున ప్రదర్శనలు నిర్వహించాయి. ఈ నిరసనల సెగ క్రమక్రమంగా రాష్ట్ర గవర్నర్ నరసింహన్ దాకా వెళ్లింది. గవర్నర్ స్వయంగా జోక్యం చేసుకుని హిమబిందు కేసులో నిందితులను అరెస్టు చేయాలని విజయవాడ పోలీసులను ఆదేశించారు. ఆ తర్వాత కొద్ది రోజుల వ్యవధిలోనే ఈ కేసు మిస్టరీని ఛేదించగలిగారు పోలీసులు.



హిమబిందును హత్య చేసింది ఎవరో కాదు... పక్కింట్లో ఉండే కారు డ్రైవర్ సుభానీ. అతడే స్నేహితులతో కలిసి ఈ హత్య చేసినట్లు తమ విచారణలో వెల్లడైందని విజయవాడ డీసీపీ రవిప్రకాష్ మీడియాకు వివరాలు వెల్లడించారు.
"హిమబిందుపై ఒకరు కాదు ఇద్దరు కాదు ఏకంగా ఆరుగురు మృగాళ్లు సామూహిక అత్యాచారం చేశారు. తమ దుర్మార్గపు ఛాయలను చెరిపేసేందుకు ఆమె గొంతు నులిమి చంపేశారు..."
"ఎక్కడ జరిగింది సార్ ఈ ఘోరం..." ఒక విలేఖరి ప్రశ్నించాడు.
"ఈ దారుణం ఇంట్లోనే జరిగింది. ఆ రోజు కూడా ఎప్పటిలాగే కుమార్తె, భర్త వెళ్లిన తర్వాత హిమబిందు ఇంట్లోకి వెళ్లింది. ఈ విషయాన్ని ప్రతీ రోజూ ఆమెను గమనిస్తున్న పక్క ఫ్లాట్ యజమాని కారు డ్రైవర్ సుభానీ ఎలాగైనా ఆమెను అనుభవించాలని చాలా రోజుల్నించి ఎదురుచూస్తున్నాడు. పక్కా ప్లాన్‌తో ఉన్న సుభానీ తోటి డ్రైవర్ గోపి, ఎలక్ట్రీషియన్ కృష్ణ, చికెన్ దుకాణంలో పనిచేసే రమణ, మరో ఇద్దరిని పిలిపించాడు. ఫ్లాట్‌లోకి వెళుతున్న హిమబిందును ఆ ఆరుగురు అనుసరించారు. అపార్ట్‌మెంట్ లోపల పైపు లైనుకు మరమ్మతులు చేయాల్సి ఉందంటూ ఇంట్లోకి ప్రవేశించి ఆమెపై అకస్మాత్తుగా దాడి చేశారు. నోరు మూసి సామూహిక అత్యాచారం జరిపారు. ఆ తర్వాత ఆమె గొంతు నులిమి చంపేశారు. సుభానీ యజమాని ఆ రోజు ఊర్లో లేకపోవడంతో మృతదేహాన్ని ఆయన ఫ్లాట్‌లో దాచారు.
మధ్యాహ్నం భోజనం చేయడానికి ఇంటికి వచ్చిన సాయిరాంకు భార్య కనిపించక పోవడంతో చుట్టుపక్కలంతా గాలించాడు. అప్పుడు సుభానీ కూడా అక్కడే ఉన్నాడు. హిమబిందు జాడ తెలియకపోవడంతో సాయిరాం పోలీసులను ఆశ్రయించాడు. పోలీసుల రాకతో సుభానీకి భయం పట్టుకుంది. హిమబిందు మొబైల్ నుంచి ఆమె కుమారుడికి ఫోన్ చేసి 'లేచిపోయినట్టు' కలరిచ్చాడు. ఆ తర్వాత... ఫ్లాట్‌లో దాచిన

**విషయం మీడియాకు పొక్కడంతో గృహిణిపై సామూహిక అత్యాచారం, హత్య అంటూ వార్తలు పతాకశీర్షికన వచ్చాయి. నిందితులను పట్టుకోవాలని, వారిని కఠినంగా శిక్షించాలని మహిళా సంఘాలు పెద్దఎత్తున ప్రదర్శనలు నిర్వహించాయి. ఈ నిరసనల సెగ క్రమక్రమంగా రాష్ట్ర గవర్నర్ నరసింహన్ దాకా వెళ్లింది. గవర్నర్ స్వయంగా జోక్యం చేసుకుని హిమబిందు కేసులో నిందితులను అరెస్టు చేయాలని విజయవాడ పోలీసులను ఆదేశించారు.**

హిమబిందు మృతదేహాన్ని గుట్టుచప్పుడు కాకుండా అర్ధరాత్రి వేళ తీసుకెళ్లి బందరు కాల్వలో పడేశాడు..."
"సుభానే హంతకుడని ఎలా గుర్తించారు?" మరో విలేఖరి ప్రశ్నించాడు.
"హిమబిందు కొడుక్కి వచ్చిన ఫోన్‌కాల్ ఆధారంగా దర్యాప్తు ముమ్మరం చేశాం. హిమబిందు ఫోన్ తీసుకున్న సుభాని ఆ తర్వాత అందులోంచి సిమ్ తీసి, తన సిమ్ వేసి బయటకు ఒక కాల్ చేశాడు. అదే అతడ్ని పట్టించింది. సుభానీని అదుపులోకి తీసుకుని మా స్టయిల్‌లో విచారిస్తే నేరం అంగీకరించాడు. దాంతో కేసు మిస్టరీ వీడింది. ఆ తర్వాత మిగతావారిని కూడా అరెస్టు చేశాం" అని డీసీపీ చెప్పారు.
అయితే ఈ కథ ఇక్కడితో ముగియలేదు. కేసు దర్యాప్తులో నిర్లక్ష్యంగా వ్యవహరించారంటూ పటమట సీఐ రవికాంత్, ఇద్దరు కానిస్టేబుళ్లపై సస్పెన్షన్ వేటు వేశారు విజయవాడ కమిషనర్ ఏబీ వెంకటేశ్వరరావు. ఆ తర్వాత విజయవాడ మహిళాకోర్టు పోలీసులు సరైన సాక్ష్యాలను సమర్పించలేదంటూ కేసును కొట్టేసింది. పోలీసులు చెప్పిన వివరాలు కల్పిత కథలాగా ఉన్నాయని కూడా కోర్టు వ్యాఖ్యానించింది. సాక్ష్యాధారాలు సరిగా లేకపోవడంతో



ఆరుగురు నిందితులనూ నిర్దోషులుగా ప్రకటించింది. నిందితులకు వ్యతిరేకంగా సాక్ష్యాలను సమర్పించడంలో ప్రాసిక్యూషన్ విఫలమైందని కూడా కోర్టు పేర్కొంది. విజయవాడ పోలీసులు ఈ తీర్పును హైకోర్టులో సవాలు చేయడంతో ప్రస్తుతం అక్కడ పెండింగ్‌లో ఉంది.

**- వేముల సత్యనారాయణ, 99854 88800**

## ఒకే దాంట్లో మూడు పనులు..

సరైన మోతాదులో ఘన, ద్రవ పదార్థాలను కొలిచేటప్పుడు ఒక ఎలక్ట్రిక్ యంత్రంలా, ఆ పదార్థాలను కలిపేందుకు, భద్రపరిచేందుకు ఒక పాత్రలా ఉపయోగపడుతుంది ఈ 'మార్ఫీ రిచర్డ్స్ త్రీ ఇన్ వన్ స్కేల్స్' (Morphey Richards 3-in-1 scales). ద్రవ పదార్థాలను లీటర్లలో కొలిచేందుకు లోపలి గిన్నెకు గుర్తుల స్కేల్ ఇచ్చారు. అలాగే ఘన పదార్థాలను కొలిచేందుకు ఎలక్ట్రిక్ మీటర్ అమర్చారు. చూసేందుకు మగ్గులా కనిపించే ఈ గాడ్జెట్‌లో ఉన్న మరో ప్రత్యేకత ఏంటంటే ఒక పదార్థం బరువు కొలిచిన తర్వాత మరో పదార్థాన్ని కొలవాలంటే, ముందున్న పదార్థాన్ని తీయకుండానే 'జీరో' చేసి కొలిచేయొచ్చు. అవసరమైతే తేలిగ్గా విడదీసి వంట పాత్రలా వాడుకునేందుకు వీలుగా కూడా దీన్ని తయారుచేశారు.



## తినేదాంట్లో ఏముందో చూపిస్తుంది..

మనం ఏం తింటున్నామో తెలుసుకోని తినడం ఎంత ముఖ్యమో, వాటిలో ఉన్న పోషకాలు, కార్బోహైడ్రేట్లు, కొలెస్ట్రాల్ ఏ మోతాదులో ఉన్నాయో తెలుసుకోవడం కూడా అంతే ముఖ్యం. రుచిగా ఉండాలని నూనె ఎక్కువగా వాడుతుంటారు చాలామంది. దీని వల్ల గుండె సమస్య పెరిగే ప్రమాదం ఉంటుంది. ఈ 'డిజిటల్ వాల్యుమెట్రిక్ స్పూన్ స్కేల్' (Digital Volumetric Spoon Scale) ఆ ఇబ్బందులను తొలగిస్తుంది. మనం తినే ఆహారంలో, అలాగే వంటకు ఉపయోగించే పదార్థాలలో ఉన్న పోషకాలు, కొలెస్ట్రాల్ తదితర వివరాలను ఇది స్పష్టంగా లెక్కకట్టి డిజిటల్ స్క్రీన్‌పైన చూపిస్తుంది. దాంతో పాటు పదార్థాలను సరైనా మోతాదులో కొలిచి వాడేందుకు ఉపయోగపడుతుంది.



 ఇంటెక్

ఈ వస్తువులను వాటి పేరుతో నెట్‌లో సెర్చ్ చేసి, వివిధ ఆన్‌లైన్ సంస్థల ద్వారా కొనుగోలు చేయవచ్చు.

## ప్రతి గిన్నెనూ కుక్కర్‌లా మార్చేస్తుంది..

మామూలు పాత్రలను కూడా కుక్కర్‌లా, మైక్రోవేవ్‌లా మార్చేందుకు ఉపయోగపడుతుంది ఈ 'ఫెర్రీ సిలికాన్ స్టీమింగ్ లిడ్' (ferry silicone steaming lid). మృదువైన సిలికాన్ రబ్బర్‌తో తయారుచేసిన దీన్ని గిన్నెలపై ఒక మూతలా మూస్తే అధికంగా ఉన్న ప్రెషర్‌ను మాత్రం మధ్యలో ఉన్న రంధ్రాల ద్వారా బయటికి పంపేసి వంటలు త్వరగా ఉడికేలా చేస్తుంది. ఇంటికి అతిథులు వచ్చినప్పుడు రకరకాల వెరైటీలు చేయాలనుకున్నప్పుడు ఈ స్టీమింగ్ లిడ్‌ను వాడి త్వరగా వంటలను పూర్తిచేసేయొచ్చు. తక్కువ ఖర్చులో కుక్కర్, మైక్రోవేవ్ ప్రయోజనాలను పొందేందుకు ఈ గాడ్జెట్ బాగా ఉపయోగపడుతుంది.



## పురుగూ.. పుట్రా చేరనివ్వదు..

నల్లుల పోరు పడలేక నారాయణుడే శేషతల్పంపై పడుకున్నాడని శ్రీనాథుడు వ్యంగ్యంగా రాశాడు. ప్రస్తుతం నల్లులు కనిపించడం తగ్గిపోయినా మనకి తెలియకుండానే మన చుట్టూ ఎన్నో పురుగులు (కీటకాలు) తిరుగుతుంటాయి. వీటిలో కొన్ని పరుపులు, మంచాలను ఆశ్రయించి మనల్ని కుట్టి నిద్రలేకుండా చేస్తుంటాయి. వీటిని చంపేందుకు రసాయన మందులు వాడితే మన ఆరోగ్యానికే చేటు. ఈ 'వెరిలెక్స్ క్లీన్‌వేవ్ పోర్టబుల్ శానిటైజింగ్ వాక్యూమ్' (Verilux CleanWave Portable Sanitizing Vacume) పరుపులు, సోఫాలు వంటి వాటిల్లో చేరిన క్రిమికీటకాలను సమూలంగా దూరం చేస్తుంది. కీటకాలను మాత్రమే కాకుండా పేరుకుపోయిన దుమ్మును తొలగించడానికి కూడా ఇది ఉపయోగపడుతుంది.



# సయాటికా, నడుంనొప్పులకు చెక్

**నడుం** నొప్పి ఉంటే జీవితం నిర్జీవంగా మారుతుంది. నొప్పి మూలంగా ఏ పనీ చేసుకోలేకపోతారు. ఉదయం వేళ నొప్పి తీవ్రంగా ఉంటుంది. అరుదుగా మూత్రవిసర్జనపై నియంత్రణ కోల్పోవడం జరుగుతుంది. దీర్ఘకాలంగా బాధపడే వారిలో శృంగార సమస్యలు కూడా ఎదురవుతాయి. సరియైన భంగిమలో కూర్చోకుండా పని చేసే వారిలోనూ, గంటల తరబడి కూర్చుని పనిచేసే వారిలోనూ ఈ సమస్య వస్తుంది. కొందరిలో నొప్పి నడుం నుంచి మోకాళ్లు, పిక్కల ద్వారా అరికాళ్లు, కాలివేళ్ల దాకా వ్యాపిస్తుంది. దీన్ని సయాటికా అంటారు. వెన్నులో ప్రతి రెండు వెన్నుపూసల మధ్య కొంత ఖాళీ ప్రదేశం, ఒక సయాటిక్ నరం, పూసలను బంధించి ఉంచే కొన్ని కండరాలు ఉంటాయి. మన దైనందిన పనుల్లోని కొన్ని లోపాల వల్ల కొందరిలో ఈ పూసలను బంధించి ఉంచే కండరాలు బలహీనమవుతాయి. ఫలితంగా పూసల మధ్య సహజంగా ఉండవలసిన ఖాళీ తగ్గిపోతుంది. దీనివల్ల పూసల మధ్య ఉండే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుంది. దీనివల్ల ఆ నరం వెంట నొప్పి వస్తూనే ఉంటుంది.

**లక్షణాలు :** చాలా మందిలో కుడి వైపు నొప్పి ఎక్కువగా వస్తుంది. నడుము నొప్పి రావడం, కొద్దిగా శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగడం, మొదట నడుము భాగంలో మొదలై క్రమేణా తొడ వెనక భాగానికి పాకుతుంది. కరెంట్ షాక్ కొట్టినట్లు నొప్పి వస్తుంది. కొన్నిసార్లు నడవడానికి, కూర్చోవడానికి ఇబ్బంది పడాల్సి వస్తుంది.

**హోమియో చికిత్స :** నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం.లుంబార్‌స్పాండిలోసిస్, సయాటికా సమస్యలకు హోమియోలో మంచి మందులు ఉన్నాయి. వీటితో నడుం నొప్పి శాశ్వతంగా పోతుంది.

# సుఖవ్యాధులకు చరమగీతం

**హెచ్ఐవి**

ఈ వ్యాధి పేరు చెబితేనే ప్రతీ ఒక్కరూ భయపడిపోతారు. చికిత్స లేని వ్యాధిగా హెచ్ఐవికి పేరుంది. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, చిన్న చిన్న వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

**హెర్పిస్ సింప్లెక్స్**

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

**హోమియో చికిత్స**

హెర్పిస్ నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్లే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు. రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106



# మైగ్రేన్ తలనొప్పి మళ్లీ రాదు

**తలనొప్పి** వచ్చిందంటే చాలు తగ్గే వరకు మామూలు మనిషి కాలేరు. రోజూ నరకం అనుభవిస్తారు. వెలుతురు చూడలేరు, చిన్న శబ్దాలను వినలేరు. తలనొప్పిఅంత తీవ్రంగా ఉంటుంది. మరి కొందరికి రెండు, మూడు రోజులకొకసారి తలనొప్పి వస్తూనే ఉంటుంది. తలనొప్పితో పాటు వాంతులు, తలతిరగడం వంటి లక్షణాలుంటాయి. ఏ పని చేసుకోలేకపోతారు. నెలలో 10 రోజులు ఆఫీసుకు సెలవు పెట్టాల్సి వస్తుంది. ఏదైనా పనిచేస్తున్నప్పుడు తలనొప్పి మరింత తీవ్రమవుతుంది. తీవ్రమైన తలనొప్పి వల్ల ఏ పనీ చేసుకోలేకపోతారు వికారం, వాంతులు, వంటి లక్షణాలు ఉంటాయి.

**కారణం ఏమై ఉంటుంది? :** సైనసైటిస్‌తో బాధపడే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. తీవ్రమైన ఒత్తిడికి గురయ్యే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. కాబట్టి ముందుగా కారణాలను తెలుసుకునే ప్రయత్నం చేయాలి.. మెదడులో కొన్ని రకాల కెమికల్స్ విడుదల కావడం, రక్తనాళం ఎన్‌లార్జ్‌మెంట్ కావడం వంటివి తలనొప్పికి కారణమవుతుంది. అలర్జీ, లైట్, పెర్‌ఫ్యూమ్, స్ట్రెస్, స్మోకింగ్, ఆల్కహాల్, సమయానికి భోజనం చేయకపోవడం వంటి కారణాలు అందులో ఉంటాయి.

**హోమియో చికిత్స తరువాత :** మైగ్రేన్ సమస్యకు ఇతర చికిత్సా విధానాల్లో పరిష్కారం లేదనే చెప్పవచ్చు. ఇతర చికిత్సల్లో లక్షణాలు తగ్గించేందుకు చికిత్స ఇస్తారే తప్ప మూలకారణాన్ని తొలగించేలా చికిత్స ఉండదు. నాలుగు రోజుల తరువాత మళ్లీ మామూలే అవుతుంది. కానీ హోమియో చికిత్స అలా కాదు. మూలకారణాన్ని తొలగిస్తుంది. మైగ్రేన్‌కు కారణమవుతున్న నరాలను సాధారణ స్థితికి తీసుకువస్తుంది. కెమికల్స్ విడుదలను అడ్డుకుంటుంది. ఫలితంగా మైగ్రేన్ సమస్య శాశ్వతంగా తగ్గిపోతుంది. సమస్య మళ్లీ పునరావృతం కావడం అంటూ ఉండదు.

# హెపటైటిస్ బి, సి, హెర్పిస్‌లపై విజయం

**హెపటైటిస్** అనగానే అందరికీ హెపటైటిస్ బి గుర్తుకువస్తుంది. కానీ అదొక్కటే కాదు అందులో చాలా రకాలున్నాయి. హెపటైటిస్ అంటే కాలేయంలో కణాలు వాచిపోయి ఫైబ్రోసిస్, సిర్రోసిస్‌కు దారితీస్తుంది. దీంతో కాలేయ పనితీరు మెల్లగా తగ్గి ప్రాణాంతకంగా మారుతుంది. ఈ వ్యాధి వచ్చిన తర్వాత శాశ్వత పరిష్కారాన్ని చూపే చికిత్స ఇతర వైద్యవిధానాలలో లేదు. కానీ హోమియో వైద్యంలో అద్భుతమైన చికిత్స ఉంది.

**ఇవీ కారణాలు :** ఎక్కువ మందితో సెక్సువల్ కాంటాక్ట్ పెట్టుకోవడం, అపరిచితుల నుంచి సేకరించిన రక్తం అంటే హెపటైటిస్ వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, స్వలింగ సంపర్కం, ఒకరు వాడిన సిరంజీలు మరొకరు వాడటం వల్ల కూడా హెపటైటిస్ వచ్చే అవకాశం ఉంటుంది. తల్లి గర్భవతిగా ఉన్నపుడు ఈ వ్యాధి సోకినట్లయితే కడుపులోని బిడ్డకు కూడా సంక్రమించే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు :** ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. తరువాత నెమ్మదిగా కామెర్లు మొదలవుతాయి. దీంతో పాటు చర్మంపై దద్దుర్లు కనిపిస్తాయి. హెపటైటిస్ బి వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. దీన్ని క్రానిక్ ఇన్‌ఫ్లమేషన్ ఆఫ్ లివర్ లేదా క్రానిక్ హెపటైటిస్ అంటారు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వైరస్‌లు కాలేయంలో మల్టిపుల్ అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది. దీన్ని రెప్లికేషన్ అంటారు. ఈ రెప్లికేషన్ అయ్యే పద్ధతిని హోమియోపతి మందుల ద్వారా అడ్డుకోవచ్చు. అంతేకాకుండా పెరిగిన వైరల్ లోడ్‌ను రోగనిరోధక వ్యవస్థ ద్వారా సమర్థంగా అడ్డుకోవచ్చు.

ADVT

# బేతాళ ప్రశ్న - 14

హస్తినా రాజ్యపు యువరాణికి స్వయంవరం జరుగుతోంది. ఆమె వేసిన ప్రశ్నకు సరైన సమాధానం చెప్పిన వారినే వరించి పెళ్లాడుతుంది యువరాణి. “10 కి మూడు కలిపితే 1. ఇది ఎలా వస్తుంది? ఎక్కడ వస్తుంది” అని సభలో ఉన్నవారిని ఉద్దేశించి ప్రశ్నించింది యువరాణి. ఒక రాకుమారుడు లేచి సరైన సమాధానం చెప్పి యువ రాణిని పెళ్లాడాడు. అతని సమాధానం ఏమై ఉంటుంది?

**సమాధానం వచ్చేవారం!**

**మీ దగ్గర ఇలాంటి మెదడుకు మేతవేసే ప్రశ్నలు, భేతాళ ప్రశ్నలు ఉంటే సమాధానంతో పాటు మా ఈమెయిల్ kerintha.aj@gmail.com కు పంపించగలరు**



**గతవారం సమాధానం:** ప్రసాద్ సంతానంలో మొదటి నలుగురి పేర్లు వరుసగా తను (tanu), తెను(tenu), తీను(tinu), టోను (tonu). ఈ పేర్లను గమనిస్తే ఇంగ్లీషు అచ్చులు (a e i o) వరసగా వస్తున్నాయి. కాబట్టి చివరి సంతానం పేరు టును (tunu) అవుతుంది.

బేతాళ ప్రశ్న-12కు సరైన సమాధానం పంపిన మొదటి ముగ్గురు: **శ్రీవల్లి కాసారం,** శ్రీకాళహస్తి, **యోషిత ప్రకాశ్,** కరీంనగర్ **రవికిరణ్ బోడపాటి,** ఈమెయిల్

# నడిచే చేప



మెక్సికోలో కనిపించే యాక్సోలాట్ (Axolotl) అనే నడిచే చేప ముఖం కామిక్ సీరియల్లో పాత్రలా భలే గమ్మత్తుగా ఉంటుంది. దానికి తగ్గట్టుగా ఇది ఓ స్కాటిష్ రచయిత సృష్టించిన ‘పీటర్ పాన్’ అనే ఓ కామిక్ క్యారెక్టర్‌లా కొద్ది పెరుగుదల తర్వాత ఇక పెరగకుండా ఉంటుంది కాబట్టి చాలామంది దీనిని ‘పీటర్ పాన్’ అనే పిలుస్తున్నారు. దీనిని నడిచే చేప అంటున్నారు గానీ... నిజానికి ఇది బల్లి జాతికి చెందినది. నీటిలోనూ, నేలపైనా ఉండగల ఉభయచర జీవి. వయసు పెరిగాక ఇది ఎక్కువగా నేలపైనే ఉన్నా దీనికి మొప్పలు మాత్రం అలానే ఉంటాయి. బల్లి పాతతోకను విడిచి కొత్త తోకను పెంచుకున్నట్టు... ఇది కూడా తన పాదాలను పునఃసృష్టించుకుంటుంది.

# రంగులు వేయండి



# మీకు తెలుసా!



- డిప్పర్ అనే పక్షులు జలపాతం వెనుక గూళ్లు కట్టుకుంటాయి.
- టమోటాల్లో పదివేల రకాలున్నాయి.
- చరిత్రలో అత్యధిక కాలం పాలించిన రాజు - పెపి II (ఈజిప్టు)
- ప్రపంచంలో మొదటి నైట్ జూని ప్రారంభించింది సింగపూర్.
- కళ్లజోడు వాడకం ఏడువందల ఏళ్ల క్రితమే ఉంది.

# చుక్కలు కలపండి



# స్వర్గానికి నిచ్చెన... ఈ కోట!



మహారాష్ట్రలోని సహ్యాద్రి పర్వతశ్రేణుల మధ్య ఒంటరిగా ఉన్నట్టు కనిపిస్తుంది ఒక కోట. దాని పేరు కళావంతి కోట. 2,300 అడుగుల ఎత్తులో ఉన్న ఈ కోటను ముంబై-పుణె ఎక్స్‌ప్రెస్‌వే నుంచి చూడొచ్చు. బుద్ధుని కాలంలో నిర్మితమైన కట్టడం ఇది. దీనిని ఏ రాజవంశం నిర్మించిందో... ఆ వివరాలేమీ ఇప్పటికీ చరిత్రకారులకు లభ్యం కాలేదు. నిటారు కొండపై ఉన్న కోటను చేరుకోవడానికి రాయిని తొలచి సన్నని మెట్లు నిర్మించారు. ఈ కోటను చేరుకోవడమంటే... ప్రపంచంలోనే అత్యంత ప్రమాదకరమైన ప్రయాణం చేయడమన్నమాట. మెట్లు ఎక్కేటపుడు పట్టుకోవడానికి ఇరువైపులా తాడు, ఫెన్సింగ్ లాంటి ఆధారాలేవీ ఉండవు. ఎత్తుగా ఉన్నదనో, లేక ప్రమాదకర ప్రయాణమనో గాని...ఈ కోటకి ‘క్లైంబ్ టు హెవెన్’ అని పేరు పెట్టారు. ట్రెక్కింగ్ అంటే ఇష్టపడేవారికి ఇది పర్‌ఫెక్ట్ డెస్టినేషన్.



# నా బొమ్మ



**ఎ.కార్తీక్,** యుకెజి శ్రీకృష్ణ ప్లే స్కూల్, విశాఖపట్టణం.

# ఈ ఫీటు వెరీ ‘గుడ్డు’

చేతులతో, మోచేతులతో కాంక్రీటు పలకల్ని పగలగొట్టడం మనందరికీ తెలిసిందే! గిన్నిస్ రికార్డు నెలకొల్పడానికి జర్మనీలో కూడా అలాంటి పోటీనే పెట్టారు. అయితే ‘కండిషన్స్ అప్లై’ అన్నట్టు ఇక్కడా ఓ కండిషన్ ఉంది. అదేమిటంటే పచ్చిగుడ్డు పట్టుకున్న చేయి మోచేత్తోనే కాంక్రీట్ బ్లాక్స్‌ని పగలగొట్టాలి. గుడ్డు మాత్రం పగలడానికి వీల్లేదు. ఈ కండిషన్ వల్ల మార్షల్ ఆర్ట్స్ విద్యార్థులు సైతం ఆ పని చేయలేకపోయారు. అయితే జర్మనీకి చెందిన జో అలెగ్జాండర్ మాత్రం చేతిలోని గుడ్డు పగలకుండానే మోచేత్తో ఎనిమిదేసి చొప్పున మూడు వరుసల్లో అమర్చిన ఇరవై నాలుగు కాంక్రీటు పలకల్ని పగలగొట్టి రికార్డులకెక్కాడు.



# దారి కనుక్కోండి





ప్రత్యేకం

‘సార్... ఇక్కడికి ఏటీఎం ఎంతదూరంలో ఉంటుంది’
‘రెండు కిలోమీటర్లు...’
‘నడిచి వెళ్లొచ్చా... లేక ఆటో తీసుకోమంటారా...’
‘సింపుల్‌గా నా వెనకే లైన్లో నిలబడండి చాలు’
ఇది సోషల్‌నెట్‌వర్క్‌లో సర్క్యులేట్ అవుతున్నజోక్ అయినప్పటికీ వాస్తవం ఇలాగే ఉంది. ఏటీఎం అంటే ‘ఎనీ టైం మనీ’ అని కాకుండా ఇప్పుడది ‘ఎనీ టైమ్ మంది’గా మారింది. ఇటీవల కేంద్ర ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం పుణ్యమా అని జనం రేయింబవళ్లు ఏటీఎంల ముందు పడిగాపులు పడుతున్నారు. ఇంతమందికి సేవ చేస్తున్న ‘ఏటీఎం’లను దేశీయంగా తయారుచేస్తున్న ఏకైక సంస్థ ‘ఓర్టెక్స్’. ‘ఏటీఎం’ల గురించి ఆ సంస్థ సీఈవో **సత్యన్ గోపాలన్** చెబుతున్న విశేషాలివి...

ఓర్టెక్స్ ప్రధాన కార్యాలయం

# ఏటీఎం కేరాఫ్...

“మన దేశంలో మొట్టమొదటిసారిగా 1987లో హాంగ్‌కాంగ్ అండ్ షాంఘై బ్యాంకింగ్ కార్పొరేషన్ (హెచ్‌ఎస్‌బీసీ) ఏటీఎంలను ఏర్పాటు చేసింది. తరువాత వినియోగదారులకు మరింత చేరువయ్యేందుకు అన్ని బ్యాంకులు ఏటీఎంలను ఏర్పాటు చేశాయి. అయితే బ్యాంకులేవీ నేరుగా ఏటీఎంలను తయారు చేయవు. మాలాంటి సంస్థలే ఏటీఎంలను తయారు చేసి బ్యాంకులకు అందిస్తాయి. మనకి ఏటీఎంలను ఏర్పాటు చేసే సంస్థలు సుమారు పది వున్నాయి. డీబోల్డ్, ఎన్‌సీఆర్, విన్కోర్ మ్యాక్స్ డార్ట్ మొదలైనవి. అయితే దేశీయంగా ఏటీఎంలు తయారు చేస్తున్న సంస్థ మాత్రం మాదే అని చెప్పడానికి నేనెంతో గర్విస్తున్నా. మద్రాస్ ఐఐటీ వారితో కలిసి మా సంస్థ ఏటీఎంలను ఉత్పత్తి చేస్తోంది. మిగతా అన్ని సంస్థలు విదేశాలకు చెందినవే. చాలా ఏటీఎంలు విదేశాల నుంచి దిగుమతి అవుతుంటే, మేం ఇక్కడ సరఫరా చేయడమే కాక విదేశాలకూ ఎగుమతి చేస్తున్నాం.

## అన్ని ఉష్ణోగ్రతలకూ అనువుగా...

మాకు చెన్నై శివారులోని పెరుంగుడిలోనూ, కేంద్రపాలిత ప్రాంతమైన పుదుచ్చేరిలోనూ ఉత్పత్తి సంస్థలున్నాయి. మద్రాస్ ఐఐటీ రీసెర్చ్ పార్క్‌లో మా కార్యాలయం వుంది. 2001లోనే ప్రణాళిక రూపొందించుకున్నా 2009 నుంచి ఏటీఎంలను పూర్తిస్థాయిలో ఉత్పత్తి చేస్తున్నాం. అన్ని వాతావరణాలకు తగినట్లుగా ఏటీఎంలను తయారు చేయడం మా ప్రత్యేకత. కొన్ని చోట్ల ఏసీ లేకుంటే ఏటీఎంలు సరిగ్గా పని చేయవు. కానీ మా ఏటీఎంలు మాత్రం ఎలాంటి వాతావరణంలోనైనా పని చేస్తాయి. మేం ఉత్పత్తి చేసిన ఎకో టెల్లర్ ఏటీఎం 50 డిగ్రీల ఉష్ణోగ్రతలోనూ పని చేస్తుందని నిరూపితమైంది. అదే విధంగా మా ఏటీఎంలు పేలుళ్లను కూడా తట్టుకుని నిలబడతాయి. ప్రపంచంలోనే అతికొద్ది విద్యుత్ వినియోగంతో పని చేసే ఏటీఎంలు మావే. కేవలం 60 వాట్ల విద్యుత్‌తోనే మా ఏటీఎం ఒక రోజంతా పని చేస్తుంది. ఏటీఎంలకు తొలిసారిగా సోలార్ విద్యుత్ వ్యవస్థను జోడించింది మేమే. కరెంటు పోయినా మా ఏటీఎంలు పని చేస్తాయి. ఎలాగంటే అందులో 48 గంటల బ్యాకప్ వుంటుంది. అలాగే అన్ని ఏటీఎంలలో ఆయా ప్రాంతాల్లోని మాతృభాషలో రసీదులు రావడం మా మరో ప్రత్యేకత.



ఓర్టెక్స్ తయారు చేసిన ఏటీఎంలు

## ఏడాదికి ఆరు వేలు

ఏడాదికి మేము 6 వేల ఏటీఎంలను తయారు చేయగలం. ఒక ఏటీఎం కాల వ్యవధి 7 సంవత్సరాలు మాత్రమే. ఆ తరువాత దానిని పూర్తిగా పక్కన పడేయాల్సిందే. ప్రస్తుతం దేశంలో మా సంస్థ ఉత్పత్తి చేసిన ఏటీఎంలు 3వేలు పని చేస్తున్నాయి. మేం మూడు రకాల ఏటీఎంలను తయారు చేస్తున్నాం. ఎకోటెల్లర్ (దీనిలో మినీ కూడా ఉంది), డెస్క్‌టాప్, వాల్ ఏటీఎం. దేశ చరిత్రలోనే మినీ ఏటీఎం ఒక రికార్డు సృష్టించింది. దీనిని ఏ గోడకైనా తగిలించవచ్చు లేదా టేబుల్‌పైన అయినా పెట్టుకోవచ్చు. ఎక్కడికైనా తీసుకెళ్లవచ్చు. గ్రామీణ ప్రాంతాల్లోని ఆసుపత్రులు, రైల్వేస్టేషన్లు, చిన్నపాటి దుకాణాల వద్ద కూడా వీటిని అమర్చుకోవచ్చు. ప్రయోగాత్మకంగా తయారు చేసిన ఈ మినీ ఏటీఎంలను వాడేందుకు ఇప్పుడు ప్రముఖ జాతీయ బ్యాంకులు

సైతం ముందుకొచ్చాయి. ధ్వంసం చేయడానికి వీల్లేని విధంగా, అత్యాధునిక సాంకేతికతతో తయారు చేస్తున్నాం.

ఆదిలో ఒక్కో ఏటీఎంలో ఒక్కో క్యాసెట్ మాత్రమే ఏర్పాటు చేయగలిగేవాళ్లు. ఒక్కో క్యాసెట్‌లో 2,500 నోట్లు మాత్రమే పెట్టగలరు. తరువాత కొన్ని సంస్థల వారు రెండు క్యాసెట్ల సామర్థ్యంతో ఏటీఎంలు తయారు చేశారు. అయితే మా ఏటీఎంలలో 4 క్యాసెట్లను అమర్చవచ్చు. అంటే ఒకేసారి పది వేల నోట్లు అమర్చవచ్చు. అవి అయిపోయే కొద్దీ క్యాసెట్లు మారుస్తూ వుండాలి. 1,000 రూపాయల నోట్లు ఒక క్యాసెట్, 500 రూపాయల నోట్లు రెండు క్యాసెట్లు, 100 రూపాయల నోట్లు మరో క్యాసెట్‌లో పెట్టేవాళ్లం. ఇప్పుడు కేంద్రప్రభుత్వ నిర్ణయంతో ఆ లెక్కలు మార్చుకోవాల్సి వస్తోంది.

### 9 దేశాలకు ఎగుమతి

మొత్తం 9 దేశాలకు మేం ఏటీఎంలను ఎగుమతి చేస్తున్నాం. అవి - బంగ్లాదేశ్, శ్రీలంక, ఇండోనేషియా, ఇరాన్, టాంజానియా, నైజీరియా, ఉగాండా, డీఆర్ కాంగో, మడగాస్కర్‌లు. అన్ని రకాల ఏటీఎంలనూ మేం దృఢంగానే తయారు చేస్తాం. కాని ఆఫ్రికా దేశాలకు వెళ్లే ఏటీఎంలకు మరిన్ని జాగ్రత్తలు తీసుకుంటాం. సాధారణంగా నగదును ఏటీఎం ముందు భాగం నుంచి అమరుస్తాం. అయితే ఆఫ్రికా దేశాలకు పంపే ఏటీఎంలలో వెనుక నుంచి క్యాసెట్లను అమర్చేలా ఏర్పాట్లు చేశాం. అంతేగాక ఏటీఎం ముఖం మాత్రమే బయటకు కనిపించేలా, మిగిలిన భాగమంతా గోడలో వుండేలా జాగ్రత్తలు తీసుకుంటాం. అంటే ఏటీఎంలను కేవలం ఆపరేట్ చేయడమే తప్ప, వాటి రూపురేఖలు వగైరాలు బయటకు కనిపించనివ్వం.

### ఏటీఎంలను ఎవరైనా కొనుగోలు చేయవచ్చా?

చేయకూడదు. కేవలం ఆర్‌బీఐ అనుమతి ఇచ్చిన బ్యాంకులు, సంస్థలకు మాత్రమే మేము వాటిని అమ్మాల్సివుంటుంది. అయినా వ్యక్తిగతంగా ఏటీఎంలను కొనుగోలు చేసి ఎవరైనా ఏం చేసుకుంటారు? మీకు ఏ బ్యాంకులో ఖాతా ఉన్నా బ్యాంకు ఏటిఎంల నుండి డబ్బు తీసుకునే వీలు 'నేషనల్ ఫైనాన్షియల్ స్విచ్' (ఎన్ఎఫ్ఎస్) ఇచ్చే సాఫ్ట్‌వేర్ వల్ల సాధ్యమవుతోంది. ఆ సంస్థ ఆర్‌బీఐ అనుమతి వున్న బ్యాంకులకు మాత్రమే ఆ సాఫ్ట్‌వేర్ ఇస్తుంది. అది వుంటేనే మన బ్యాంకు కార్డులు పని చేస్తాయి. అది లేనప్పుడు ఏటీఎం యంత్రం వృధాయే కదా!

### ఏటీఎంలు ఎందుకు మొరాయిస్తున్నాయి?

మన రూ.100 నోటు ఎత్తు 73 మి.మీ, వెడల్పు 157 మి.మీ., రూ.500 నోటు ఎత్తు 66 మి.మీ, వెడల్పు 150 మి.మీ, రూ.1000 నోటు ఎత్తు 73 మి.మీ, వెడల్పు 177 మి.మీ., వీటి ప్రకారమే మన దేశంలోని ఏటీఎంలన్నీ తయారయ్యాయి. ఇప్పుడు హఠాత్తుగా రూ.1000 నోటు రద్దు చేశారు. రూ.2000 నోటు తెచ్చారు. దాని ఎత్తు 66 మి.మీ, వెడల్పు 166 మి.మీ. మిషీన్‌లో ఈ నోట్లకు సరిపోయే వైశాల్యంతో క్యాసెట్లు సిద్ధం చేయాల్సి వుంటుంది. ఆ ప్రక్రియ పూర్తయితే ఏటీఎంలు పరుగులు తీస్తాయి. ఇందుకు కొంత సమయం పడుతుంది. దేశవ్యాప్తంగా సుమారు 2 లక్షల ఏటీఎంలున్నట్లు అంచనా. కానీ కేవలం 3 వేల ఏటీఎంలే పని చేస్తున్నాయని అధికారవర్గాలే చెబుతున్నాయి. ఇవన్నీ సర్దుకోవడానికి కొంత సమయం పడుతుంది. మా వరకు సగం ఏటీఎంలు గాడిలో పడ్డాయి. మిగిలిన ఏటీఎంలను కూడా డిసెంబరు 31వ తేదీ నాటికి వాడకానికి వీలుగా మారుస్తాం. ఏటీఎంల సంగతి సరే, వాటిల్లో పెట్టడానికి తగిన కరెన్సీ ఇంకా ప్రింట్ కాలేదు కదా!

### తగినన్ని ఏటీఎంలు వున్నాయా?

మన దేశ జనాభా 130 కోట్లు. ఇప్పుడున్న 2 లక్షల ఏటిఎంలు డబుల్ అయితే ప్రజలకు సరిపోతాయేమో. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లో ఎక్కువ ఏటీఎంలు లేవు. అక్కడ వినియోగం తక్కువగా వుండడంతో ఏర్పాటు చేయడం లేదు. అందుకే మేం దేశంలోనే తొలిసారిగా మినీ ఏటీఎంలను ఉత్పత్తి చేస్తున్నాం. గ్రామీణ ప్రాంతాలకు అవి బాగా సరిపోతాయి. ఇందులో ఒకసారి 5000 నోట్లు దాకా పెట్టవచ్చు. పెద్ద ఏటీఎంలు పెడితే బ్యాంకులకు ఖర్చు ఎక్కువ. బ్యాంకింగ్ రంగంలో మరెన్నో మార్పులు రావాల్సి వుంది.



మినీ ఏటీఎం



మొబైల్ ఏటీఎం

'క్యాష్ లెస్' విధానం పెరిగితే ఉపయోగమే. నల్లధనం అరికట్టాలన్న ఉద్దేశం మంచిదే కానీ దీని అమలులో ఎంతోమంది ఇబ్బంది పడుతున్నారు.

### మా సిబ్బందికీ తిప్పలే

మా వద్ద 200 మందికి పైగా సిబ్బంది వున్నారు. 'ఏటీఎంలు తయారు చేస్తుంటారు కదా, మీకు డబ్బు ఇబ్బంది వుండదేమో' అని చాలామంది అంటుంటారు. కానీ డబ్బు లావాదేవీలతో మాకు సంబంధముండదు. మా సిబ్బందికి నెలనెలా బ్యాంకు అకౌంట్లలోనే జీతం జమ చేస్తాం. తరువాత వారు డ్రా చేసి తీసుకుంటారు. ప్రస్తుతం అందరితో పాటు వారూ తిప్పలు పడుతున్నారు.

**- డాక్టర్ ఎస్‌కేఎండీ గౌస్‌బాషా**, ఆంధ్రజ్యోతి, చెన్నై

ఫోటోలు : కర్రి శ్రీనివాస్

## ఎందుకు...?



### చదరంగా ఉన్నా రింగ్ అంటారు...?



మొదట్లో బాక్సింగ్ రోడ్డుమీదే జరిగేది. ఇదొక స్ట్రీట్‌ఫైట్‌లా ఒకరిపై ఒకరు ముష్టిఘాతాలు కురిపించుకునే విధంగా ఉండేది. వీక్షకులు.. ఆటగాళ్ల చుట్టూ ఓ వృత్తంలా నిలబడి వారిని ప్రోత్సహించేవారు. అలా బాక్సింగ్ రింగ్ అనే మాట ఏర్పడింది. తర్వాత కాలంలో బాక్సింగ్ క్రీడలో ఎన్నో మార్పులు వచ్చాయి. ప్రస్తుత బాక్సింగ్ క్రీడకు ఓ రూపం రావడం మొదలైంది 1743లో. ఆటగాళ్లు తలపడే వేదిక చదరంగా, అందరికీ కనిపించే విధంగా ఎత్తుగా ఏర్పాటు చేశారు. సున్నితమైన ప్రదేశాల్లో ముష్టిఘాతాలు విసరడాన్ని నిషేధించారు. ఇలా ఎన్ని మార్పులు వచ్చినా బాక్సింగ్ రింగ్ అనే పేరు మాత్రం అలానే ఉండిపోయింది.

### చూయింగ్ గమ్ కరగదు...?



గంటల తరబడి నమిలినా, అంతసేపూ నోట్లో లాలాజలంలో ఊరుతూనే ఉన్నా చూయింగ్ గమ్ కరగదని గమనించే ఉంటారు. దానికి కారణం చూయింగ్ గమ్ తయారీలో ఉపయోగించే గమ్ బేస్. ఈ గమ్ బేస్‌ను రబ్బరు చెట్టు బెరడు నుంచి వచ్చే జిగురు నుంచి తయారు చేస్తారు. దీని తయారీలో రుచి కోసం, పరిమళం కోసం ఎన్నోరకాల ఇతర పదార్థాలను వాడినా... గమ్‌బేసే దీనికి ప్రధాన వస్తువు. ఆ జిగురే నోటిని పరిశుభ్రంగా ఉంచడంలో తోడ్పడుతుంది. చూయింగ్ గమ్‌ని పొరపాటున మింగినా భయపడక్కర్లేదు. మన జీర్ణవ్యవస్థ దానిని రెండు మూడురోజుల్లో బయటకు పంపేస్తుంది.

## మిక్చర్ పొట్లం

బొమ్మలు : వెంకట్

### మీరు వెళ్లక్కర్లేదు

"సుభద్రా .. ఆ మెడికల్ కిట్ ఇలా పట్రా. పాపం ఎవరో కుర్రాడు .. నేను లేకపోతే బతకలేనంటున్నాడు" కంగారుగా అరిచాడు డా. శేషాద్రి.

"రిసీవర్ పెట్టేయండి. ఆ కాల్ వచ్చింది అమ్మాయికనుకుంటా" వంటింట్లోంచి కేకేసింది సుభద్ర.

### నాకిది మామూలే!



వస్తాద్ సులేమాన్ నిమ్మకాయ పిండి "మీలో ఎవరైనా దీన్లోంచి ఇంకొక్క చుక్క రసం తీసినా నేను ఓడిపోయినట్టే" అని సవాల్ విసిరాడు.

కాసేపటివరకు ఎవరూ ముందుకు రాలేదు. చివరకు ఒకతను వచ్చి పిండి రెండు చుక్కల రసం తీశాడు.

"ఎలా తియ్యగలిగావు?" ఆశ్చర్యపోయాడు సులేమాన్.

"నేను ఇన్‌కమ్ టాక్స్ ఉద్యోగిని" బదులిచ్చాడు అతను.

### గొప్పకోసం పోయా ..

"ఆమెతో నీ పెళ్లి తప్పిపోయిందటగా..."

"అవును."

"నీ మేనమామ కోటీశ్వరుడని చెప్పలేకపోయావా?"

"చెప్పాను. ఆమె ఇప్పుడు నాకు అత్త కాబోతోంది".

### ఇంతకంటే మార్పేముంది?



ఒక ప్రఖ్యాత హాలివుడ్ తార రోజు రోజుకీ కృశించిపోతూ చివరికి తనకొచ్చిన జబ్బు ఏదో అర్థంగాక డాక్టర్‌ను సంప్రదించింది. రిపోర్టులన్నీ చూశాక "మీలో ఏ జబ్బూ లేదు. లైఫ్‌లో మార్పు అవసరం" చెప్పాడు డాక్టర్.

"ఈ రెండేళ్లలో నలుగురు భర్తలను, ఆరు కార్లను, డజను మంది వంటవాళ్లను, ఇరవైమంది పనిమనుషుల్ని మార్చాను. ఇంతకంటే ఇంకేం మార్పు కావాలంటారు?" ఉక్రోషంగా అరిచింది తార.

### అదే తేడా!

"బ్రహ్మచారికీ, పెళ్లైనవాడికీ మధ్యన ఉండే ఒక తేడా చెప్పు?" అడిగాడు బుచ్చిబాబు.

"బ్రహ్మచారి ఏది పడితే అది తింటాడు. పెళ్లైనవాడు ఏది పెడితే అది తింటాడు" చెప్పాడు పిచ్చిబాబు.

## మాటతో బద్ధకం మాయం



"ఆ డాక్టర్ నిజంగా దేవుడే. మా ఆవిడ బద్ధకాన్ని చిటికెలో పోగొట్టాడు" సంతోషంగా చెప్పాడు పానకాలు.

"ఎలా?" అడిగాడు కనకాలు.

"మా ఆవిడ చెప్పినవన్నీ విని 'వయసు పెరుగుతోంది కదమ్మా' అన్నాడు. ఆ మాట మందులా పనిచేసింది" చెప్పాడు పానకాలు.

## ఛాయా'చిత్రం'



"ఎవర్రా మమ్మల్ని ... విడదీసినోడు?"

## ఎవరికెంత లాభం?

"నా సలహా వలన మీకు లాభం కలిగిందనుకుంటాను" అడిగాడు లాయర్.

"ఏదో కొంత. నాకు సలహా ఇచ్చినందుకు మీకు కలిగినంత మాత్రం కాదు" పెదవి విరిచాడు క్లయింట్.

## వెంట్రుక బేరం



రేఖ పొడుగాటి జడ చూసి ప్రేమించేశాడు సుబ్బారావు. రేఖ మాత్రం సుబ్బారావుని ఛీకొట్టింది. కొంత కాలం తర్వాత సుబ్బారావు ఆ ఊరి నుండి వెళ్లబోతూ రేఖ తమ్ముడితో "ఒరేయ్ .. మీ అక్క తల వెంట్రుక ఒకటి తెచ్చివ్వు. జీవితాంతం దాచుకుంటాను. అందుకు నీకు వంద చాక్లెట్లు కొనిస్తా" అన్నాడు.

"మా అక్క జడకు వేసుకునే సవరమే తెచ్చిస్తా .. ఎన్ని చాక్లెట్లు ఇస్తావో చెప్పు ముందు?" అడిగాడు రేఖ తమ్ముడు.

# మరలా తపస్సుకు కూర్చో!



బొమ్మలు : అక్బర్

ఏమి చూసి మోహిస్తివి ఈ ప్రపంచాన్ని
గాన సరస్సులో మునిగిన యవ్వనుడా
ఉదయ సూర్యుణ్ణి ముద్దాడే ధీశాలి
భగవంతుడు పిలిచాడా?
లేదే!
స్వర్గం నుండే కదా రాలిపడిన వాడివి
మరలా అక్కడికి ఎలా వెళ్లగలవు
ఈ నిశి రాత్రి
కొత్తగా ఏ రాగ ప్రేయసి రమ్మందనీ?
నీ ఆత్మ చేసే చప్పుడు వినబడడం లేదే
ఎక్కడ దాక్కున్నావు?
ఎప్పటిమల్లే
మంత్ర పుష్పాల మధ్య కచ్చేరీకి సిద్ధంకా
గంధర్వుడా ..
మరలా తపస్సుకు కూర్చో
మరలా సవరించుకో నీ గొంతుకని!

(మంగళంపల్లి మహానుభావుడికి నివాళి)

- డా. పెరుగు రామకృష్ణ, 9849230443

ఈ వారం కవితలు

# వేరార్యూ?



లేరని తెలిసీ ఉన్నారని చూస్తాం. రారని ఖరారే. వస్తారని నిరీక్షిస్తాం. రోజులు మారినంత సులువు కాదు. గాయాలు మానేవరకూ గబ్బిలాల్లాగానే గడుపుతాం.

రోజు సుదీర్ఘంగా అనిపిస్తుంది. బతుకు అనంతంగా భయపెడ్తుంది. ముగింపు గురించిన సందేహాలు కండ్లలో ముండ్లు మొలిపిస్తాయి.

ఎవరి ఖాతావరణంలో వాళ్లు. అందరిళ్లల్లోనూ అల్పపీడన కేంద్రీకృతమైనట్లుగానే ఉంటుంది. అలా అందరూ పనుల్జేసుకుంటున్నట్టుగా కనబడ్తుంటారు కానీ, కళ తప్పిన మొహాలు కథల్ని పాడుతూనే ఉంటాయి.

చూడగా చూడగా లోపల్లోపల బావురుమంటున్న వాళ్లే తప్ప, లోకమ్మీదకు వచ్చి బావుకుంటున్నోళ్లెక్కరూ అగుపించరు. కొన్ని ద్రోహకాల సమయాల్లో.

మెల మెల్లగా చీకట్లోకి జారుకుంటున్న వేళ నువ్వు గుర్తొస్తావు. పెరిగిన దూరాల్ని కరిగించే సాధనాలు లేకపోవడం బాధగా తోస్తుంది.

- మోహన్ రుషి, 83417 25452

## 11-17 డిసెంబర్ 2016

# అనుగ్రహం

డాక్టర్ పి.ఎ.రామన్



### మేషం : అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం

ఈ వారం సంప్రదింపులు, వ్యవహారాలతో హడా వుడిగా ఉంటారు. మీ అభిప్రాయాలను కచ్చితంగా తెలియజేయండి. మొహమాటాలకు పోవద్దు. శ్రీమతి లేక శ్రీవారి వైఖరిలో మార్పు సంభవం. సంతానం అత్యుత్సాహాన్ని అదుపు చేయండి. ఆర్థిక లావాదేవీలు లాభిస్తాయి. ధనలాభం, వస్తు ప్రాప్తి, వాహనయోగం. అనుకూల పరిస్థితులు నెలకొంటాయి. గృహం లో సందడి నెలకొంటుంది. బంధువులతో ఉల్లాసంగా గడుపుతారు. ఖర్చులు విపరీతం. పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి.



### వృషభం : కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు

బంధుమిత్రులతో స్పర్థలు తలెత్తుతాయి. సౌమ్యంగా సమస్యలు పరిష్కరించుకోవాలి. సంతానం ద్వారా శుభవార్తలు వింటారు. వ్యవహార ఒప్పందాల్లో ఏకా గ్రత అవసరం. తొందరపాటుతనం వల్ల నష్టాలు తప్పవు. శ్రమాధి కృత మినహా ఫలితం ఉండదు. ఆది, సోమవారాల్లో ఆందోళన కలి గించే సంఘటనలెదురవుతాయి. సన్నిహితుల సాయం అందుతుంది. ఒకేసారి అనేక పనులతో సతమతమవుతారు. ఖర్చులు అధికం, ఒక అవసరానికి ఉంచిన ధనం మరో దానికి వ్యయం చేస్తారు.



### మిథునం : మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు

ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. భేషజాలకు పోయి విపరీతంగా వ్యయం చేస్తారు. చేతిలో ధనం నిలబడదు. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. మంగళ, బుధ వారాల్లో పనుల సానుకూలతకు మరింతగా శ్రమించాలి. ఆసక్తికరమైన విష యాలు తెలుసుకుంటారు. ఆత్మీయుల కలయిక సంతోషా న్నిస్తుంది. వేడుకలు, విందుల్లో పాల్గొంటారు. కొత్త పరిచయా లేర్పడతాయి. సంతానం అత్యుత్సాహాన్ని అదుపు చేయండి.



### కర్కాటకం : పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష

నిర్దిష్ట ప్రణాళికలతో ముందుకు సాగుతారు. ఖర్చులు భారమనిపించవు. ఒక వ్యవహారం లో ధనం అందుతుంది. ఆరోగ్యం జాగ్రత్త. సొంత పరిజ్ఞానంతో మందులు వేసుకోవద్దు. గురు, శుక్ర వారాల్లో పనుల ప్రారంభంలో ఆటంకాలెదురవుతాయి. అపరి చితులతో మితంగా సంభాషించండి. ప్రేమానుబంధాలు బల పడతాయి. గృహంలో సందడి నెలకొంటుంది. స్త్రీల ప్రతిభకు గుర్తింపు లభిస్తుంది. జూదాలు, బెట్టింగ్‌ల జోలికి పోవద్దు.



### సింహం : మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం

మీ శ్రీమతి శ్రీవారి వైఖరిలో మార్పు వస్తుంది. సం తానం గురించి ఆలోచిస్తారు. పరిచయాలు, బంధు త్వాలు బలపడతాయి. సంప్రదింపులకు అనుకూలం. స్థిమితంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. పెద్దల సలహా పాటిం చండి. ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. ఆకస్మిక ఖర్చులుం టాయి, ధనం మితంగా వ్యయం చేయండి. బ్యాంకులు, ఫైనాన్స్ సంస్థలతో ఇబ్బందులెదురవుతాయి. శనివారం నాడు పంతాలు, పట్టింపులకు పోవద్దు. అనేక పనులతో సతమతమవుతారు.



### కన్య : ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు

అన్ని రంగాల వారికి యోగదాయకమే. అంచనాలు ఫలిస్తాయి. ధనానికి ఇబ్బంది ఉండదు. బంగారం, వాహనం, విలాస వస్తువులు కొనుగోలు చేస్తారు. రశీ దులు జాగ్రత్త. ఆది, సోమ వారాల్లో పనులు మొండిగా పూర్తి చేస్తారు. స్త్రీల ప్రతిభాపాటవాలు వెలుగులోకి వస్తాయి. బంధువులతో స్పర్థలు తలెత్తుతాయి. మీ కోపతాపాలను అదుపులో ఉంచుకోండి. విమర్శించిన వారే మీ ఔన్నత్యాన్ని గుర్తిస్తారు. సంతానం విజయం సంతోషం కలిగిస్తుంది. మీ కృషి త్వరలో ఫలిస్తుంది.



### తుల : చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు

ప్రతి విషయంలోను ఆచితూచి వ్యవహరించండి. సలహా కంటె సొంత నిర్ణయమే మంచిది. మీ శ్రీమతికి అన్ని విషయాలు తెలియజేయండి. ఆత్మీయులతో ఉల్లాసంగా గడుపుతారు. సంతానం కదలికలపై శ్రద్ధ వహించండి. ఒక సమాచారం ఆలోచింపచేస్తుంది. యత్నాలు ఫలిస్తాయి. నిర్దిష్ట ప్రణాళికలతో ముందుకు సాగుతారు. మంగళ, బుధ వారాల్లో ఇతరుల విషయాల్లో జోక్యం తగదు. ఖర్చులు విపరీతం. ధనానికి ఇబ్బంది ఉండదు. కొన్ని వ్యవహారాలు సానుకూలమవుతాయి.



### వృశ్చికం : విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ

గృహంలో ప్రశాంతత నెలకొంటుంది. కొన్ని పనులు అనుకోకుండా పూర్తవుతాయి. ప్రముఖులను కలుసు కుంటారు. అవకాశాలు కలిసివస్తాయి. ఆది, గురు వారాల్లో పరిచయం లేని వారితో జాగ్రత్త. ఆంతరంగిక విషయాలు వెల్లడించవద్దు. ఆత్మీయులతో ఉల్లాసంగా గడుపుతారు. ఖర్చులు సామాన్యం. మానసికంగా కుదుటపడతారు. ఆరోగ్యం మందగిస్తుంది. వైద్యసేవలు అవసరమవుతాయి. విద్యార్థులు పోటీల్లో విజయం సాధి స్తారు. ఉద్యోగస్తుల బాధ్యతల్లో ఏకాగ్రత వహించండి.



### ధనుస్సు : మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం

వ్యవహార ఒప్పందాల్లో తప్పటడుగు వేసే ఆస్కారం ఉంది. పెద్దల సలహా పాటించండి. బంధుమిత్రులు ధనసహాయం అర్థిస్తారు. పెద్దమొత్తం సహాయం క్షేమం కాదు. మంగళ, శని వారాల్లో మీ ఇష్టాయిష్టాలను లౌక్యంగా వ్యక్తం చేయండి. ఎవరినీ నొప్పించవద్దు. అందివచ్చిన అవకాశాన్ని తక్షణం వినియో గించుకోండి. వేడుకలను ఆడంబరంగా నిర్వహిస్తారు. మీ ఉన్నతిపై కొంతమంది అపోహపడే ఆస్కారం ఉంది.



### మకరం : ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు

ఖర్చులు అంచనాలను మించుతాయి. ఆదా య మార్గాలు అన్వేషిస్తారు. అవతలి వారి తీరును గమనించి మెలగండి. ఆత్మీయుల రాక కోసం ఎదురుచూస్తారు. గురు, శుక్ర వారాల్లో పనుల సానుకూలతకు మరింతగా శ్రమించాలి. గత తప్పిదాలు పునరావృతం కాకుండా జాగ్రత్త వహించండి. అవకాశాలు చేజారినా నిరుత్సాహపడవద్దు. మీ కృషి త్వరలో ఫలిస్తుంది. సంతానం భవిష్యత్తు, ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం.



### కుంభం : ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు

కొత్త విషయాలు గ్రహిస్తారు. పనులు ముందుకు సాగవు. పరిచయస్తుల రాక ఇబ్బంది కలిగిస్తుంది. శని వారం నాడు అప్రమత్తంగా వ్యవహరించాలి. ఎదుటి వారి వ్యాఖ్యలు ఉద్రేకపరుస్తాయి. ఎట్టి పరిస్థితుల్లోను సహనం కోల్పో వద్దు. నిందించిన వారే మీ ఔన్నత్యాన్ని గుర్తిస్తారు. ఆదాయానికి తగ్గట్టు ఖర్చులుంటాయి. ఆరోగ్యం సంతృప్తికరం. సోదరులతో సంప్ర దింపులు జరుపుతారు. మీ ఇష్టాయిష్టాలను కచ్చితంగా తెలియ జేయండి. ఉద్యోగ బాధ్యతల్లో పొరపాట్లను సరిదిద్దుకుంటారు.



### మీనం : పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి

ప్రముఖులతో సంప్రదింపులు జరుపుతారు. ఒక సమాచారం ఉపశమనం కలిగిస్తుంది. పనులు, వ్యవ హారాలు స్వయంగా చూసుకోవాలి. అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు. ఆర్థిక లావాదేవీలతో హడావుడిగా ఉం టారు. ధనమూలక సమస్యలెదురవుతాయి. వ్యాపారాలు మందకొడిగా సాగుతాయి. పెట్టుబడులు, వ్యాపారాల విస్తరణలకు తరుణం కాదు. ఖర్చులు అధికం, చెల్లింపులు, నగదు స్వీకరణలో జాగ్రత్త. హామీలిచ్చి ఇబ్బందులెదుర్కుంటారు. ఉద్యోగస్తులకు ఏకాగ్రత ప్రధానం.

## అవునా!



జీబ్రాల చారలు మన వేలిముద్రల్లాంటివి. ఒకదానికొకటి సంబంధం ఉండవు.

- ప్రాచీన గ్రీస్‌లో ఒలంపిక్ క్రీడలు స్త్రీలకు నిషిద్ధం. చూసినవాళ్లకు మరణశిక్ష విధించే వారు.

- ప్రపంచంలో అన్నిటికంటే పెద్ద కళ్లున్న (15 అంగుళాలు) జీవి - జెయింట్ స్క్విడ్.



అనకొండలు చనిపోయేవరకూ పెరుగుతూనే ఉంటాయి.

- చైనా ముఖ్య పట్టణాల్లో ఒకటైన షాంఘైలో ఎరుపు రంగు కారు ఉండటం నేరం.

- పబ్లిక్ లైబ్రరీల నుంచి తరచూ చోరీకి గురయ్యే పుస్తకం - గిన్నిస్ వరల్డ్ రికార్డ్స్.

- జంక్‌ఫుడ్‌లో ఉపయోగించే కెమికల్స్ కారణంగానే వాటిని ఎక్కువగా తినాలనిపిస్తుందట.



అనాస మొక్క ఏడాది కాలంలో ఒక పండును మాత్రమే ఇవ్వ గలదు.

- ప్రపంచంలో అత్యంత చిన్న రెక్కలున్న జీవి - టాంజానియా కందిరీగ.

- భూమ్యాకర్షణ శక్తి నుంచి తప్పించుకోవడానికి రాకెట్ సెకనుకు ఏడుమైళ్ల వేగంతో పైకి ఎగరాలి.

# అదృష్ట రత్నజ్యోతి


## రమేశ్చంద్ర మహర్షి

సెల్ : 92465 82255, ఫోన్ : 040-6522 5554


**డి.ఎస్.సి., ఖమ్మం / మా అబ్బాయి...**

1. బృహస్పతికి స్వక్షేత్ర స్థితి, రవితో సమాగమం వలన ఈ జాతకుడు ప్రథమ సంతానం.

2. చంద్రుని స్థితి వలన ఒక చెల్లెలుంటుంది. ఆ స్థితి స్వక్షేత్రం కావడం కారణంగా, ఆమె చాలా వృద్ధిలోకి రావడం జరుగుతుంది.

3. కుజుని వలన తల్లికి ఒక సోదర నష్టం ఉంటుంది.

4. చంద్రునికి తదుపరి స్థానంలో శని ఉండడం, చతుర్థాత్ షష్టమంలో స్థితి పొందిన చంద్రుని వలన తల్లి ప్రభుత్వోద్యోగి. అయితే రవి గురుల మీద పంచమం తాలూకు ప్రభావం వలన మధ్యలోనే వీఆర్ఎస్ తీసుకుంటారు. శనికి కేతు రాహు సంబంధం వలన తల్లికి ఉద్యోగంలో మరీ ఉన్నతికి వెళ్ళే పరిస్థితి కూడా ఉండదు.

5. రవి గురు శుక్రుల వలన తండ్రి ఇంజినీర్. ఆయన తన తండ్రికి ప్రథమ సంతానం.

6. ఇతని విద్య ఇంజినీరింగ్.

7. 20 నుండి 40 వరకూ నడిచే శుక్ర దశ బాగానే ఉంటుంది. ఇతని భార్యకు విదేశయానాలను ఎక్కువగా ఇస్తుంది, ఉద్యోగం రీత్యా. ఇతనికి కూడా ఆఫ్ అండ్ ఆన్ విదేశ యానాలు ఉంటాయి.

8. శుక్రునిలో శుక్రునిలో... అంటే 20 నుండి 23 మధ్య ఇంట్లో వయసు మీరిన వారికి గండాలు. అలాగే ధనం విషయంలో ఇబ్బందులు.

9. 24, 26 మధ్య శుక్రునిలో చంద్రునిలో పైచదువుల కోసం విదేశ యానం. చెల్లెలికి ఇతరత్రా బాగుంటుంది. కానీ ఒక వివాహం కుదిరి చెడిపోతుంది. ఈ సమయంలో ఒక వేళ వివాహం జరిగితే విడిపోవడం ఉంటుంది. కనుక ఆ కోణంలో చెల్లెలికి కొన్ని పరిహారాలు పాటించడం అవసరం. అలాగే ఎవరూ ఆమెను స్నేహం పేరు చెప్పి ఎక్స్‌ప్లాయిట్ చేయకుండా చూసుకోవాలి. శని కేతువులకు పరిహారాలు పాటించాలి.

10. 26, 27లో ఈ జాతకునికి కళ్యాణ ఘడియలు. వివాహం జరుగుతుంది. జరగాలి. జరగడం ఒక అవసరం. లేకపోతే ఆ కళ్యాణ ఘడియలు గండం రూపంలోకి రూపాంతరం చెందుతాయి. అమ్మాయిని ఎంచుకునేటప్పుడు, గట్టి సంతానభావం ఉన్న జాతకురాలిని చూసుకోవాలి. ఇక్కడ అవసరం లేకపోయినా చెప్పుకునే ఒక విషయం... ఇతనికి వివాహం కాగానే ఇతని భార్య వైపు వారికి ఒకటి రెండు స్థిరాస్తులు పోతాయి.

11. 27 నుండి 30 మధ్య రాహు భుక్తి. చేంజాఫ్ ప్లేస్. చేంజాఫ్ జాబ్. అయితే కుజదోషం కాటేసే సమయం. రెమిడీస్ పాటించకపోతే సంసారం నిలవడం కష్టమే. పాటిస్తే చిన్నపాటి యాక్సిడెంట్ రూపంలో అది వెంట్ తీసుకుని తప్పిపోతుంది! మొత్తానికి మరీ చెడు జరగకుండా తప్పించే అంశం గురు సంచారం!

12. 30 నుండి 32 మధ్య బృహస్పతి భుక్తి. ఈ జాతకునికి సంతానయోగం. ఇతని భార్యకు ప్రాణగండం. దీని అర్థం... డెలివరీ సమయంలో పెద్ద ప్రాణానికి గండం! ఇది జాతకం తెలియనప్పుడు. తెలిసింది కనుక పరిహారాలు పాటించాలి. వాటిలో అతి పెద్ద పరిహారం... అసలు ఈ పీరియడ్‌లో సంతానం కలగకుండా చూసుకోవడం. అయినా కూడా భార్యకు గండం అనేది ప్రబలంగా ఉంది కనుక ఆమె ఆయుష్షుకు రెమిడీస్ పాటించడం చేయాలి. తప్పిపోతుంది.

13. 33 నుండి 36 మధ్య శన్యంతర్దశ. గృహయోగం. విదేశ యానాలు. పాస్‌పోర్ట్ బుక్ నిండిపోతుంది.

14. 36 నుండి 38 మధ్య బుధ భుక్తిలో ఈ జాతకునికి ధనయోగం. ఇతని భార్య ష్యూరిటీలు ఇచ్చి, అలాగే షేర్స్/స్పెక్యులేషన్ చేసి పొందే ధననష్టం. అయితే మొత్తానికి కృత్రిమ పద్ధతిలో కలిగే సంతాన యోగం.

15. రవి దశలో బాగుంటుంది కానీ ధనాన్ని, ఆస్తుల్ని కాపాడుకోవాలి. దీనిలోనే 42వ ఏట భార్య ఆయుష్షుకు మళ్ళీ గట్టి రెమిడీస్ పాటించాలి.

16. చంద్ర దశలో... అంటే 45 నుండి 55 మధ్య యోగం. ధన యోగం. తల్లి ఆరోగ్యం కాపాడుకోవాలి. అయితే ఏది ఎంతగా యోగించినా పాపకర్తరి, శని కేతువులు చేస్తున్న దాడి వలన మనశ్శాంతి కోల్పోకుండా పరిహారాలు పాటించాలి. అతి సున్నితంగా ఆలోచించడం మానేయాలి.

17. కుజునిలో కుజునిలో... అంటే 56 వయసులో భార్యాభర్తలిద్దరికీ ఒకేసారి యాక్సిడెంట్, గండం కనిపిస్తుంది కనుక మిగతా పరిహారాలతో పాటు చేసే అతి పెద్ద పరిహారం... ఎక్కడికి గానీ ఏ ప్రయాణం కానీ ఇద్దరూ కలిసి చేయకపోవడమే!!

ఈ వారం కథ

# అశోకం

● ఓల్గా

ఎప్పటిలానే ఆ ఉదయం తొలి కిరణాల వెలుగులో పూల అందాన్నీ, పరిమళాన్నీ ఆస్వాదిస్తూ పుష్పసేకరణ చేస్తున్న నయనకు ఎక్కడి నుంచో సన్నని విషాద గీతికవంటి శోకం వినిపించింది. అశోకవనంలో శోకం! ఆ వనంలో బాల్యం నుంచి తిరిగిన నయనకు ఆశ్చర్యం, భయం ఒక్కసారే కలిగాయి.

ఆ శోకపు నెలవు ఎక్కడా అని వెతుకుతూ వెళ్ళిన ఆమెను కొందరు సైనికులు ఆపేశారు. వారంతా స్త్రీలే. అందరి ముఖాల్లో ఆందోళన కనపడుతూనే ఉంది.

"ఇక్కడి నుంచి మరి ముందుకు దారి లేదమ్మా నయనా! వెనుదిరుగు" నయనకు పెద్దమ్మ వరసయ్యే త్రిజట గంభీరంగా చెప్పింది.

"ఎందుకమ్మా? ఏం జరిగింది? అశోకవనంలో ఆ శోకమెవరిది? మీరంతా ఇక్కడెందుకున్నారు? సైనికులకు అశోకవనంలో ఏం పని? మండోదరీదేవికి తెలిస్తే ఆమె కోపగించరా?"

నయన ప్రశ్నలు పున్నాగ పూలు రాలినట్లు రాలిపడుతున్నాయి. త్రిజట నయనను మిగిలినవారి నుంచి పక్కకు తీసుకెళ్ళి జరిగినదేమిటో క్లుప్తంగా వివరించింది.

నయన వడివడిగా నడుచుకుంటూ

**అద్దంలో తన ప్రతిబింబాన్ని నిశితంగా పరీక్షించుకున్నట్టు చూసుకుంది మండోదరి. ఎక్కడా చిన్న పొరపాటు జరగలేదు అలంకరణలో. వస్త్రాల వర్ణాలకు తగినట్టే ఉన్నాయి ఆమె ఆభరణాలు. ఆమె అందం రూపురేఖల్లో, శరీర సౌష్టవంలో, ఆరోగ్యంలోనే కాదు మనసులోంచి కళ్ళ ద్వారా ప్రవహించే ప్రేమ, తెలివి, ఆత్మగౌరవపు నిశ్చితత్త్వం ఇవన్నీ కలిసి ఆమెకొక ప్రత్యేక గుర్తింపునిస్తాయి. ఎంత పెద్ద సమూహంలోనైనా మండోదరిని అతి తేలికగా గుర్తించవచ్చు. సౌకుమార్యం కంటే దారుఢ్యమే ఆమెకు ప్రత్యేకతనిస్తుంది.**

అర చేతులకు ప్రత్యేకంగా లేపనమొకటి రాస్తూ మళ్ళీ అద్దంలో చూసుకుంది మండోదరి. సముద్రతీరంలోకాక సముద్రం లోపల వెతికి వెతికి తెచ్చిన అపురూపమైన సుకుమారమైన ఆల్చిప్పలను సూర్యకిరణాల ఆకారంలో పొదిగి తయారుచేసిన అద్దం అది. మధ్య బింబం స్థానంలో అద్దాన్ని అమర్చారు. తృప్తిగా తన అలంకరణను ముగించి 'నయన ఇంకా పూలు తేలేదు. బహుశ కలవరపడి నడవలేకపోయిందేమో. కలవరం కలతగా మారకుండా సమస్య తీరితే బాగుండు' అనుకుంటూ వెనుదిరిగింది.

"అమ్మా! మండోదరీ దేవి" అంటూ అలజడితో పరిగెత్తినట్లే నడుస్తూ వస్తున్న నయనను ఆపేందుకు నాలుగడుగులు ముందుకు నడిచి "నయనా! నాకంతా తెలుసు. నువ్వు ఆయాస పడనవసరం లేదు. వెళ్ళి నీ పనులు పూర్తి చెయ్యి, ఎప్పటివలె." ప్రతిరోజూ మండోదరి మాటల్లో వినపడే ప్రేమ తప్ప మరొక భావం వినపడక పోవడంతో నయన ఆశ్చర్యపోయింది. ఇంత జరిగినా మండోదరిలో ఆగ్రహమో, ఆవేదనో లేకుండా ప్రేమ ఎలా పలికింది?

నయన ముఖంలో ఆమె మనసుని చదివినట్టు మండోదరి ఆమె భుజం మీద చెయ్యివేసి "ఆగ్రహం, ఆవేదన నీ మీద, నీ గురించి కాదు గదా నయనా! ఇవాళ పువ్వులు చాలా తక్కువ తెచ్చావేమిటి అలంకరణను కొత్త రీతిలో యోచించావా?"

నయన ఆమె ముందు నిలవలేనట్టు తను తెచ్చిన పూలను తీసుకుని సహాయకుల కోసం వెళ్ళింది.



మండోదరి మందిరానికి వచ్చింది. కాని మండోదరికి అంతా తెలిసినట్లే ఉంది.

ఇప్పుడేం జరుగుతుంది? నయన నయనాలలోంచి ఉబికిన కన్నీటితో ఆమె తెచ్చిన పూలు తడుస్తున్నాయి. మంచు బిందువులు హెచ్చుగా ఉన్నాయేమిటి, ఏమిటీ వైపరీత్యం అని పూలు ఉలిక్కిపడ్డాయి.



ఉదయపు ఎండ క్రమంగా వేడెక్కింది. మండోదరి మందిరం రావణుడు వస్తున్నాడనే వార్తతో వేడెక్కింది. మందిరంలో ఆమె స్నేహితులు, సన్నిహితులు ఉత్కంఠతో ఉక్కిరిబిక్కిరవుతున్నారు. బంధువులు ఉదయం నుంచి అక్కడికి రావడానికి సాహసించలేకపోతున్నారు.

మండోదరి భగవతీ ప్రార్థన ముగించి తన పనిలో మునిగిపోయింది. సువర్ణ, రజిత, కాంస్య లోహాలతో ఆమె ప్రకృతిని అనుకరిస్తూ ఎన్నో ఆభరణాలు, గృహాలంకరణలు చేస్తుంది. పూల రంగులతో వస్త్రాలపై వివిధ వర్ణ సమ్మిళితమైన చిత్రాలను చిత్రిస్తుంది. ఉదయం నుంచి సాయంత్రం వరకూ చిన్న చిన్న విరామాలతో ఆమె ఆ పనిలో మునిగిపోతుంది. రాచకార్యాలు ముగించుకుని వచ్చిన రావణునితో సాయంత్రాలు సంగీతోత్సవం జరుపుతుంది. మండోదరి స్వర మాధుర్యానికి రావణుని వీణావాదన కలిస్తే ఆ మందిరమంతా ఆనంద తరంగితమవుతుంది. సముద్రపు అలలు మందిరంలోకి వచ్చేందుకు విఫలయత్నం చేస్తూ ఉవ్వెత్తున ఎగసిపడతాయి.

లంకలో మండోదరి కళాప్రావీణ్యం గురించీ, అలంకార ప్రియత్వం గురించీ తెలియని వారు లేరు.

రోజులనిలా ప్రశాంతంగా ఆనందంగా గడిపేందుకు మండోదరి చేసిన పోరాటాలు, ప్రయత్నాలు తక్కువేమీ కాదు.

అరణ్యాలలోని స్వేచ్ఛా జీవనం వదులుకుని లంకా నగరంలో జీవించటం ఆమెకు చాలా కష్టమే అయింది.

మహావృక్షాలను కూల్చేసి, వన్య మృగాలను తరిమేసి లంకా నగరం నిర్మించాలనే రావణుని ఆలోచనతో యుద్ధం చేసీ చేసీ అలసిపోయి విరమించిందామె. నగర నిర్మాణమనే బీజం రావణుని మనసులో మహావృక్షమైంది. నగర నిర్మాణం, రాజ్య విస్తరణ, సార్వభౌమాధికారం, అధికార అంతరువులు ఇవన్నీ ఆర్య సంస్కృతి లక్షణాలు.

రావణునికి ఎందుకు మనసుకెక్కిందో గాని ఆ సంస్కృతిని అనుసరించాలనే తీవ్రకాంక్షకు లోనయ్యాడు. ఆ కాంక్ష అతన్ని వశపరచుకున్నట్లు తను అతన్ని వశపరచుకోలేకపోయిందే అని బాధపడి, చివరికి ఆ నగరంలోనే తనకంటూ ఒక ప్రత్యేకమైన చోటు కల్పించుకుంది మండోదరి.

“ఈ నాగరికత మహోధృతంగా వ్యాపిస్తోంది. దానిలో మనం ఆర్యులను మించిపోకపోతే ఆర్యులు మనల్ని మిగలనివ్వరు” అంటాడు రావణుడు.

“మనం మిగలటమంటే అర్థమేమిటి రావణా! మనదైనతనాన్ని వదిలి ఆర్యులననుకరించి వారి సంస్కృతిలో వారిని మించిపోతే అది మనంగా మిగిలినట్లవుతుందా? లేదా పూర్తిగా మునిగిపోయినట్లవుతుందా?” అన్న మండోదరి మాటల్లోని వివేకం రావణునికి అర్థమైనా నగరలోలత్వం అతని వివేచనను పూర్తిగా దురాక్రమించింది.

లంకానగరంలో మండోదరి కోసం అతి సుందరమైన అశోకవనం రూపొందింది.

నగర నిర్మాణపు తొలి రోజులలో వృక్షాలు కూలుతుంటే మండోదరి రోదననెవరూ ఆపలేకపోయేవారు. సముద్రపు హోరు నిశ్శబ్దమై వినమ్రంగా ఆమె విషాదాన్ని ఆలకించి నిలువునా నీరయ్యేది. అప్పుడు రావణుడు ఒక అతిలోకవనం గురించి ఆలోచించి, మండోదరిని అందులో భాగం చేశాడు. ఆ వనం పెరుగుతున్న కొద్దీ మండోదరి శోకం ఉపశమించింది. ఆ వనానికి అశోకవనమనే పేరు అలా స్థిరపడింది. అక్కడ పువ్వులు నవ్వుతాయి. పిట్టలు నవ్వుతాయి. నెమళ్ళు నృత్యం చేస్తాయి. లేళ్ళు విహరిస్తాయి. తుమ్మెదలు మత్తుగా పాడతాయి. కోయిలలు మనసులను తట్టి లేపుతాయి. సీతాకోక చిలుకలు అల్లరిగా వనమంతా ఎగురుతుంటాయి. మహావృక్షాలకూ, గరికపచ్చ మైదానాలకూ మధ్య వివక్షలేని ఒక సమతుల్య సౌందర్యలోకం అది. ప్రశాంతమైన ఆనందం. లోభం, లౌల్యం లేని ఆనందం.

ఆ ఆనందవనంలో, ఆ అశోకవనంలో తొలిసారిగా ఒక శోకం. మండోదరి మనసుని అశాంతిమయం చేసిన శోకం. ఆర్య నగర నాగరికతలో ఈ మధ్య అతి తరచుగా వినపడుతున్న ఆడదాని శోకం.

నువ్వెంత ప్రయత్నించినా నగరంలో దాని విషాదఛాయలు ప్రవేశించక మానవు అని మండోదరికి చెబుతున్నట్లుగా మొదలైన శోకం.

రావణుడు వచ్చాడు. ప్రశ్నించమన్నట్లు మండోదరి ఎదుట చేతులు కట్టుకుని నిల్చున్నాడు.

సమాధానాలు సిద్ధం చేసుకుని వచ్చిన వారిని వారు ఆశించిన ప్రశ్నలు వేసేంత వివేకహీనురాలు కాదు మండోదరి.

‘ఆర్యుల చేతిలో పరాజయం పాలైన రావణునికి ఎలాంటి ఉపశమనం కావాలో’ అంది చేతిలో పని ఆపకుండానే.

రావణుడు నిర్ఘాంతపోయాడు.

“ఆర్యుల చేతిలో పరాజయమా? నాకా? ఏమంటున్నావు?”



**“మనల్ని ఇష్టపడని, ప్రేమించని వ్యక్తులను బలవంతంగా ఎత్తుకు రావటమనే పని, అదీ వంచనతో ఎత్తుకు రావటమనే పని, పిరికి పని చేయటమంటే అది ఆర్యుల నాగరికతకు తలవంచటం కాదా? వారి అడుగుజాడలలో నడవటం కాదా? ఏం ఆశించి ఆమెను తెచ్చి అశోకవనంలో శోకాన్ని నింపారో తెలియటం లేదు....”**

“మనల్ని ఇష్టపడని, ప్రేమించని వ్యక్తులను బలవంతంగా ఎత్తుకు రావటమనే పని, అదీ వంచనతో ఎత్తుకు రావటమనే పని, పిరికి పని చేయటమంటే అది ఆర్యుల నాగరికతకు తలవంచటం కాదా? వారి అడుగుజాడలలో నడవటం కాదా? ఏం ఆశించి ఆమెను తెచ్చి అశోకవనంలో శోకాన్ని నింపారో తెలియటం లేదు. మనల్ని ఇష్టపడని వారికి మనం గౌరవంగా వీడ్కోలు చెబుతామే! ఆ విలువను పోగొట్టుకున్న మీరు అపజయాన్ని మూటగట్టుకుని వచ్చారనే అనుకుంటున్నాను.”

రావణుడు క్షణం నిరుత్తరుడైనాడు. తనను తాను కూడదీసుకుని “సీత నిమిత్తం. రాముడిని జయించి లంకానగరాన్ని రక్షించుకోవటం నా ఉద్దేశం.”

“నగరాన్నా? ప్రజలనా మీరు రక్షించేది?”

“మండోదరీ! నీకు అర్థం కావటం లేదు. ఆర్య నాగరికతను, ఆర్య సామ్రాజ్యాన్ని దక్షిణాపథమంతా విస్తరించుకుంటూ లంకా నగరాన్ని జయించే ఉద్దేశంతో వస్తున్నాడు రాముడు. మనం చేతులు ముడుచుకు కూచుంటే ఆర్యులు జయిస్తారు. వాళ్ళ యుద్ధ వ్యూహాలనూ, నీతి పేరిట ప్రచారం చేసే కపటోపాయాలనూ అనుసరించే మనం వాళ్ళను ఓడించాలి.”

“వాళ్ళను అనుసరించేందుకు జయించటమెందుకు?”

“జయించాక మన సంస్కృతిని తిరుగులేకుండా స్థాపించుకోటానికి.”

“మన సంస్కృతి నీకింకా గుర్తుందా రావణా!” వ్యంగ్యంగా నవ్విందామె.

“ఉంది. నువ్వనుకున్నంత మారిపోలేదు నేను. లంకా నగరాన్నెంత ప్రేమిస్తానో, అశోకవనాన్నంతే ప్రేమిస్తాను. రెండింటికీ ఆలోచనా బీజాలు నావే.”

“అరణ్యాన్ని తీసి వనాన్ని పెంచావు. అది

మార్పు కాదని నమ్ముతున్నావు. ఇవాళ ఆ వనంలో ఒక ఆర్య స్త్రీ శోకగీతాన్ని వినిపించి వన ప్రయోజనాన్నే కాలదన్నావు. ఈ మార్పు మంచికేనని నమ్ముతున్నావు."

"ఆమెను నగరంలోని ఈ భవనాల్లోకి తెస్తే ఆమెకు చిక్కులొస్తాయని అక్కడుంచాను మండోదరీ. ఆర్యులకు స్త్రీల శీలం గురించి ఎంత పట్టింపు ఉంటుందో నువ్వూహించలేవు. అశోకవనంలో ఉంటే ఆమె భవిష్యత్తు బాగుంటుందని అలా చేశాను. నీకు ఇబ్బందే. నా కోసం, ద్రవిడ విజయం కోసం నువ్వు కొద్దికాలం ఇది భరించక తప్పదు."

ఇంక మాటలు పొడిగించటం ఇష్టం లేక రావణుడు వెళ్ళిపోయాడు. మండోదరి రావణుని అర్థం చేసుకునే ప్రయత్నంలో కాలాన్ని మరిచిపోయింది.

సాయం సమయంలో జరిగే సంగీతోత్సవం ఆనాడు ఆగిపోయింది. మళ్ళీ ఎన్నడూ జరగలేదు.

రావణుడు యుద్ధ సన్నాహాలలో మునిగిపోయాడు.

మండోదరి అంతర్మథనంలో నలిగిపోతూ, తన అలంకరణలో, పువ్వులలో, ఆభరణాల తయారీలో సేదదీరాలని ప్రయత్నిస్తూ ఉంది.

•••

"ఆమె మహారాజుని లెక్క చేయటమే లేదు. మీ అంత సౌందర్యవతీ కాదు. ఇదంతా ఏమిటమ్మా?"

నయన అశోకవనం గురించి ప్రతిరోజూ ఏదో ఒక మాట అనకుండా ఊరుకోదు.

ఆ వేళ నయన సీత సౌందర్య ప్రసక్తి తేవటంతో మండోదరిలో ఏదో కుతూహలం కలిగింది.

"ఆమె ఎలా ఉంటుంది నయనా? వివరంగా చెప్పు."

"ఎవరైనా నిరలంకారంగా, కళాహీనంగా ఉన్నప్పుడు ఉన్న అందం కూడా మరుగునపడదా అమ్మా! నా కళ్ళకు ఆమె దీనంగా అతి సాధారణంగా కనిపించింది."

"ఒక్క అలంకారమూ లేదా? ఆభరణమూ లేదా?"

"లేదమ్మా. చూడామణి ఒక్కటి తప్ప ఏ ఆభరణాలూ లేవు. సిగలో ఒక్క పువ్వు కూడా తురుముకోకుండా జుట్టు విరబోసుకుని ఉంది. ముఖాన ఎర్రటి చుక్క ఒక్కటే కాస్త శోభనిస్తుంది."

ఒక స్త్రీ అంత దయనీయ స్థితిలో ఉందని విని మండోదరి మనసు కరిగిపోయింది.

తను ఈ మధ్య కాలంలో తయారుచేసిన ఆభరణాలు, నూతన వస్త్రాలు తీసుకుని సీతను చూడడానికి బయలుదేరింది. అశోకవనంలోని పరిమళభరితమైన పువ్వులను కూడా వాటికి జోడించి సీత దగ్గరకు వెళ్ళింది.

మండోదరి పరిచయం చేసుకోగానే సీత ముఖం వివర్ణమైంది. నూతన వస్త్రాభరణాలతో, పువ్వులతో వచ్చిన మండోదరి అంతరంగాన్ని ఆమె పూర్తిగా అపార్థం చేసుకుంది.

రావణుని పనుపున వచ్చిందనుకున్నది.

"సీతా! నువ్వింత దయనీయంగా, నిరలంకారంగా ఉండాల్సిన అవసరం ఏముంది? నీ భర్త నిన్ను రక్షించి తీసుకెళ్ళేందుకు సర్వసన్నద్ధుడై వస్తున్నాడు. నువ్వు దిగులు పడకుండా అతని కోసం ఎదురుచూస్తూ ఈ అశోకవనంలో ఆనందంగా కాలం గడుపు."

మండోదరి మాటలకు సీత తెల్లబోయింది. 'ఈమె తన శత్రువు భార్య కదా! స్నేహితురాలి లాగా మాట్లాడుతుందేమిటి?' ఇదంతా మరొక తంత్రంలో భాగం కావొచ్చనే ఆలోచనతో సీత ముఖం మళ్ళీ ఎరుపెక్కింది.

సీత ముఖంలోని మార్పుని గమనిస్తూ అనునయంగా చెప్పింది మండోదరి.

"నీ భర్త వియోగం బాధాకరమే అయినా రావణుని వల్ల నీకెలాంటి అపాయమూ కలగదు. మమ్ము ఇష్టపడనివారినీ, వారి అభిప్రాయాన్ని గౌరవించే నీతి మా జాతికి ఉంది."

"అపహరించుకు రావటమేనా గౌరవించటం" పరుషంగా పలికింది సీత.

"అది మీ నుంచి నేర్చుకున్నదేనమ్మా. నా భర్త ఆర్య సంస్కృతిని ద్వేషిస్తూనే తనకు తెలియకుండానే ఆ లక్షణాలను కొన్ని అలవరచుకున్నాడు. ఇప్పుడు యుద్ధం..."

మండోదరి మాటలు పూర్తికాకుండానే "యుద్ధంలో నా భర్త జయిస్తాడు. నీ భర్త



మరణిస్తాడు" అని మళ్ళీ అంతే పరుషంగా పలికింది సీత.

"ఎంత కఠినమైపోయింది సీతా నీ మనసు. యుద్ధం జరగదేమో - స్నేహం కుదురుతుందేమో - ఇరువురూ ఒకరినొకరు జయించలేని సమాన ప్రతాపాలు గలవారమని తెలుసుకుని సంధి చేసుకుంటారేమో! దాని కోసం మనిద్దరం ప్రయత్నించవచ్చు గదా!"

"అది జరగదు" సీత స్థిరంగా చెప్పింది.

"జరుగుతుంది... జరగదు. నీ మనసుకి నీ భర్త జయిస్తాడనే నమ్మకం ఉంది గదా. ఆ నమ్మకంతో ఆశతో సంతోషంగా ఉండు. నీ శరీరాన్ని కృశింపజేసుకోకుండా సర్వాలంకారాలతో సుశోభితంగా ఉండు."

"భర్త దగ్గర లేనప్పుడు ఆర్య స్త్రీలు అలంకరించుకోరు."

"అలంకరణలకూ భర్తలకూ సంబంధమేమిటి?" నవ్వింది మండోదరి.

"భర్తల కోసం కాకపోతే ఈ అలంకరణలు దేనికి?"

"వివాహం కాకముందు నీవు అలంకరణ చేసుకోలేదా? మనం మన సంతోషం కోసం హుందాతనం కోసం, మన శరీరాలను గౌరవించుకోవటం కోసం అలంకరించుకుంటాం. దానిని చూసి భర్తలు సంతోషపడవచ్చు... కొందరు చికాకు పడవచ్చు. కానీ మనం? మన శరీరాలు మనవి కాదా సీతా- మనం వాటిని గౌరవించుకోవాలి కదా!"

"అమ్మా - నీ మాటలు నాకు ఏమాత్రం హితవుగా లేవు. అర్థమే కావటం లేదు. నేనూ, నా శరీరం, మనస్సు సర్వం రాముని కోసమే."

"ఇదా ఆర్య స్త్రీల ప్రతిపత్తి! మీదంటూ మీకేమీ లేదా?" నివ్వెరపోయింది మండోదరి.

"లేదు. లేకపోవటంలో అగౌరవమేమీ లేదు. ఎంతో గౌరవముంది" స్థిరంగా పలికింది సీత.

"ఎంత మోసం జరిగింది! నయనా చూశావా ఆర్య స్త్రీల స్థితి. పద పోదాం. కానీ సీతా ఆలోచించమ్మా. నీ గురించి నువ్వు ఆలోచించుకోమ్మా."

సీతకు కోపం పెరుగుతోంది.

"నీ గురించి నువ్వు ఆలోచించుకోవలసిన కాలం ఇది. నీ భర్త మరణించాక కూడా ఇలాగే సర్వాలంకారాలతో ఉంటావో లేదో ఆలోచించుకో" కటువుగా అన్న సీత మాటలకు మండోదరి మనసు కలత చెందింది.

"రావణుడంటే నాకు ప్రేమ లేదనుకోకు. కానీ నా ప్రేమ బానిసత్వం కాదు. అచ్ఛమైనది. స్వచ్ఛమైనది. బాహ్య సంకేతాలతో నిరూపణలతో దానికి పని లేదు. నన్ను నేను లేకుండా చేసుకుని రావణుని ఎలా ప్రేమించగలను. అందుకే యుద్ధం వద్దని రావణునితో వాదిస్తూ యుద్ధం చేస్తున్నాను. ఆయన పొరపాట్లను ఎత్తి చూపుతున్నాను. దండకారణ్యంలోని రక్షక రాజుల సంహారాన్ని గురించి నువ్వు రామునితో ఏమీ మాట్లాడి ఉండవు. మాట్లాడి ఆపగలిగితే ఇక్కడిదాకా వచ్చేదానివి కాదేమో!"

సీత తనకిక మాట్లాడటం ఇష్టం లేనట్లు ముఖం అటువైపు తిప్పుకుంది.

మండోదరి అనేక ఆలోచనలతో వెనుదిరిగి వచ్చింది.

•••

యుద్ధం ముంచుకు వస్తోంది.

రామదూత అయిన వనచరుడు వచ్చి లంకలోని భవనాలకు నిప్పు అంటించాడు. అశోకవనంలో అనేక సుందర ప్రాంతాలను ధ్వంసం చేశాడు.

"నగరం వనచరునికి ఆగ్రహం రప్పించిందంటే అర్థం చేసుకోగలను నయనా. కాని అశోకవనాన్ని ఒక అరణ్యవాసి ధ్వంసం చేశాడంటే నమ్మలేకపోతున్నా. ఆర్య నాగరికత మత్తుమందై మన దక్షిణవాసులను విపరీతంగా లోబరుచుకుంటుందన్నమాట. తెలిసీ తెలియకా దానికి అందరూ అలవాటుపడుతున్నారు."

మండోదరికి ఇప్పుడు రావణ దర్శనం అరుదైపోయింది.

యుద్ధం ఆరంభమైంది.



రావణ సంహారం పూర్తయి, సీత అగ్నిపరీక్షా జరిగిపోయింది. విభీషణునికి పట్టాభిషేకం చేసి అయోధ్య బయలుదేరాలి సీతా రామలక్ష్మణులు. రావణుని అపర కర్మలన్నీ ఆర్య పద్ధతుల ప్రకారం ఒక చక్రవర్తికి తగిన రీతిలో ఘనంగా జరిపించమన్నాడు రామచంద్రుడు విభీషణునితో.

ఎండిన గంధపు కొమ్మలతో, అనేక దివ్య ఔషధ గుణ సంపన్నమైన మూలికలతో సువర్ణ రజతాది లోహ నిర్మితమైన చితి తయారుచేశారు.

అగ్నిపరీక్ష కలిగించిన ఆత్మక్షోభ నుంచి సీత ఇంకా బయటపడలేదు. జరుగుతున్నదేమీ ఆమెకు పట్టటం లేదు.

"మన శరీరాలు మనవి కాదా సీతా! వాటిని గౌరవించుకోవాలి కదా!" అన్న మండోదరి మాటలు ఎక్కడి నుంచో వినపడి శరీరమంతా మంటలు చెలరేగుతున్నాయి ఆమెలో. ఆ మంట ఆర్పటం సీతకు అసాధ్యంగా ఉంది.

సీత వేదనను గమనిస్తూ సీత అగ్నిపరీక్ష భవిష్యత్తులో తనకు అగ్నిపరీక్ష అవుతుందని భయపడుతూ, సీతనెలా శాంతింపచేయాలా అని ఆలోచిస్తున్న రాముని దగ్గరకు విభీషణుడు వచ్చాడు.

"రామచంద్రా! అన్నీ మీరు చెప్పినట్లే చేశాను. కానీ మండోదరీదేవి మీ ఆచారాలను పాటించడానికి ఏ మాత్రం ఒప్పుకోవటం లేదు."

"ఏ ఆచారాలు?" రామునికి కుతూహలమనిపించి అడిగాడు.

"ఆమె నిరలంకారంగా ఉండనన్నారు. తాను జీవించినంతకాలం సర్వాలంకారాలతో పుష్పమాలాలంకరణలతోనే ఉంటానని అన్నారు. ఆమెను ఒప్పించే శక్తి నాకు లేదు."

రాముడు నిశ్చేష్టుడయ్యాడు.

మండోదరి వైధవ్యాన్ని నిరాకరిస్తోంది. ఇదెలా సాధ్యం? రామునికి ఎంత ఆలోచించినా ఏమీ తోచలేదు. రావణుని అపరకర్మలు జరగకుండా విభీషణ పట్టాభిషేకమా? అదెలా కుదురుతుంది? చాలాసేపు యోచించి దీర్ఘంగా నిట్టూర్చి "రావణుని చితి ఆరాలంటే ఆమె వైధవ్యాన్ని పొంది తీరాలని చెప్పండి. మా ఆజ్ఞ అని చెప్పండి" అన్నాడు కటువుగా.



విభీషణుడు మండోదరి ముందు చేతులు కట్టుకు నించున్నాడు. రాముని మాటలు ఆమెకు వినిపించాడు.

"రామబాణం వలె ఇవాళ లంకా నగరంలో రామాజ్ఞ కూడా అనుల్లంఘనీయం తల్లీ. నా నిస్సహాయతను అర్థం చేసుకోమ్మా!" అని వేడుకున్నాడు.

మండోదరి ఆగ్రహాన్ని అదిమిపెట్టి "చక్రవర్తివై కూడా నిస్సహాయుడనని చెప్పుకుంటున్నావు. ఆర్యుల పక్షం వహిస్తూ ఆర్యధర్మమని విర్రవీగుతున్న 'అగ్ర సోదర భక్తి'ని అరికాలి కింద వేసి తొక్కావు.



**"మండనివ్వు విభీషణా... ఆర్య నాగరికత మీద ఒక ద్రవిడ స్త్రీ ఎగరవేసిన తిరుగుబాటు బావుటాగా ఆ చితి మంటలను నలువైపులా ఎగురుతూనే ఉండనివ్వు. ఆ చితి ఇప్పుడు నువ్వు ఆర్పినా ఆరదు. లంకలోనే కాదు. ప్రతి నగరంలోనూ రావణ కాష్టం ఒకటి రగులుతూనే ఉంటుంది...."**

అయినా రాముడు దానికి హర్షించాడే గానీ ఇది ఆర్యధర్మం కాదనీ, నిన్ను అన్నగారి దగ్గరకు తిరిగి వెళ్ళమనీ పంపలేదు. ఇవాళ వాళ్ళ ఆచారాలను పాటించాలని ఆయన నన్ను ఆజ్ఞాపించటం చిత్రంగా ఉంది" అన్నది.

"అన్నిటి కంటే ధర్మరక్షణ ముఖ్యమని రామచంద్రుని భావన. అందుకే నన్ను..." విభీషణుని మాటల అర్థం గ్రహించినట్లు ఒక చీత్కారం చేసింది మండోదరి.

"ఏది ధర్మమో నిర్ణయించే అధికారం చేతిలోకి తీసుకున్నవారు ఏ మాటలైనా చెప్పగలుగుతారు. ఎంత పనైనా చేసి ఆమోదింప చేసుకోగలుగుతారు. అయినా నా రావణుడే లేనపుడు ఈ చర్చలు నాకు అనవసరం."

"మరి ఇప్పుడు కర్తవ్యం?"

మండోదరి కొద్ది క్షణాలు నిర్లిప్తంగా చూసింది. ఆ తర్వాత సాధికారతే నిండుగా నవ్వినట్లుగా ఒక చిన్న నవ్వు నవ్వింది.

"విభీషణా! ఇది నా ఆజ్ఞగా రామునితో చెప్పు. రావణుని చితి లంకానగరంలో ఎన్నటికీ ఆరిపోదు, మండుతూనే ఉంటుంది. అతనిపై నా ప్రేమాగ్ని కూడా నా హృదయంలో జ్వలిస్తూనే ఉంటుంది. మండోదరి ఆర్య సంప్రదాయాలను అనుసరించి నిరలంకారమై వైధవ్యాన్ని పొందదు. రావణ కాష్టాన్ని రగులుతూనే ఉండనీయండి. నువ్వు పట్టాభిషేకం చేసుకో. నేను సమీపారణ్యాలలోకి నా సన్నిహితులతో, బంధువులతో తరలిపోతున్నాను. అయినా నా ఆజ్ఞ పాటించి తీరాలి నువ్వు. రావణుని చితి ఆరనీయకు. అశోకవనాన్ని వాడనీయకు."

విభీషణుడు రాముడిని ప్రాధేయపడి ఒప్పించి పట్టాభిషేకం జరుపుకున్నాడు.



అరణ్యం ఆకురాలు కాలంలో కూడా అందంగానే ఉంటుంది. ఏ ఋతువు అందం ఆ ఋతువుది. మండోదరికి వృద్ధాప్యం మీద పడినా అసామాన్య కాంతితో చూసే వారి మనసులకు ఆనందాన్ని కలిగిస్తోంది. అరణ్యంలోని మహావృక్షాలలో ఆమె కూడా ఒక వృక్షమన్నట్లే జీవిస్తోంది.

ఒకనాడు విభీషణుడు వచ్చాడు.

"అమ్మా, మనం వృద్ధులమయ్యాం. ఎన్నో మార్పులు జరిగాయి. రాముడు సీతను పరిత్యజించాడు. సీత రాముడి నుంచి విముక్తురాలై తన తల్లి దగ్గరకు వెళ్ళిపోయింది. రాముడూ ఈ లోకం నుంచి నిష్క్రమించాడు. కానీ మా అన్న రావణుని చితి మాత్రం మండుతూనే ఉంది. మీరు అనుమతిస్తే-

"మండనివ్వు విభీషణా... ఆర్య నాగరికత మీద ఒక ద్రవిడ స్త్రీ ఎగరవేసిన తిరుగుబాటు బావుటాగా ఆ చితి మంటలను నలువైపులా ఎగురుతూనే ఉండనివ్వు. ఆ చితి ఇప్పుడు నువ్వు ఆర్పినా ఆరదు. లంకలోనే కాదు. ప్రతి నగరంలోనూ రావణ కాష్టం ఒకటి రగులుతూనే ఉంటుంది. రావణుని చితిని ఆరనీయకుండా చేసింది నేను కాదు. రాముని ఆర్య సంస్కృతి. ప్రతి నగరంలో అవి మండితేనే తమకు మనుగడ అని ఆ సంస్కృతి భావించే రోజొకటి వస్తుంది. ప్రతి నగరంలోనూ రావణకాష్టాలను మండించి తనను రక్షించుకోవాలని చూస్తుందది. కానీ ఏదో ఒకరోజు ఆ మంట వారినే దహించి వేస్తుంది. సర్వనాశనం చేస్తుంది. ఇది జరుగుతూనే ఉంటుంది. మరొకవైపు అశోకవనం పచ్చగా మన జాతి అరణ్య జీవన పరిమళాలకు సంకేతంగా నిలిచిపోతుంది". రావణుని స్మృతులతో మండోదరి కళ్ళు కన్నీటితో నిండాయి. చిత్రంగా ఆ కళ్ళలో ఒక కన్ను ఎర్రని నిప్పుకణికలా మండుతోంది. మరో కన్ను ఆకుపచ్చ కాంతులీనుతోంది.

...............................................................................

రచయిత్రి సెల్ : 98490 38926

## ఇవీ వచ్చాయి

**పంచసప్తతి**
(డైరెక్ట్ కథా సంకలనం - 2016)
**సం. :** డా. వేదగిరి రాంబాబు
**పేజీలు :** 614, **వెల :** రూ.300
**ప్రతులకు :** 93913 43916

---

**చురక** (రన్నింగ్ కామెంటరీ)
**రచన :** వేల్పుల నారాయణ
**పేజీలు :** 178, **వెల :** రూ.125

**సౌందరనందము**
**రచన :** పింగళి లక్ష్మీకాంతం
కాటూరి వేంకటేశ్వరరావు
**పేజీలు :** 90, **వెల :** రూ.70
**ప్రతులకు :** నవచేతన, విశాలాంధ్ర

---

**ప్రిన్సెస్ యశోధర**
(చారిత్రక నాటకం)
**రచన :** సి. శ్రీనివాసరాజు
**పేజీలు :** 102, **వెల :** రూ.125

**మెదడు - మనము**
**రచన :** కె.బి. గోపాలం
**పేజీలు :** 258, **వెల :** రూ.250

**మా ప్రసిద్ధిపేట**
(నిన్న మొన్నటి జ్ఞాపకాలు)
**రచన :** డా. జి. బాలశ్రీనివాసమూర్తి
**పేజీలు :** 96, **వెల :** రూ.58

**లంద పొద్దు**
(తెలంగాణ బహుజన కవిత్వం)
**రచన :** గుడిపల్లి నిరంజన్
**పేజీలు :** 160, **వెల :** రూ.100
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

---

**వివిధ**
**రచన:** పెంటమరాజు నరసింగరావు
**పేజీలు :** 168, **వెల :** రూ.150
**ప్రతులకు :** 94404 58132

---

**ఒక వీరుడు మరణించడు**
(స్వర్గీయ సోమసుందర్‌కు వ్యాస నివాళి)
**సం. :** శశికాంత్ శాతకర్ణి
**పేజీలు :** 94, **వెల :** రూ.80
**ప్రతులకు :** విశాలాంధ్ర

---

**సమాజ శాస్త్రాల్లో పరిశోధన విధానం**
**రచన :** పి. సత్యనారాయణ
**పేజీలు :** 194, **వెల :** రూ.175
**ప్రతులకు :** నవోదయ బుక్ హౌస్

## కొత్త పుస్తకాలు

# ఆదివాసుల గాయాల చరిత్ర

ఏ చీకూచింతా లేకుండా .. ఇప్పసారా తాగుతూ .. రేలా రేలా పాటలు పాడుతూ .. థింసా నృత్యాలు చేస్తుండే ఆదివాసులు కనిపించే పుస్తకాలు కావు ఇవి. అవన్నీ ప్రభుత్వం, మీడియా చూపించే దృశ్యాలు. బాలగోపాల్ చూపించే ఆదివాసీ దృశ్యాలు పూర్తిగా వేరే. వీటిలో కనిపించే ఆదివాసులు మంచినీళ్లు దొరకని, వ్యవసాయ భూమి దొరకని, వైద్యం దొరకని, జీవనానికి ప్రాణానికి భద్రత లేని ఆదివాసులు. తమను తాము నాగరికులమని చెప్పుకునే ప్రజలు, వ్యవస్థలు తాము అమాయకులని భావించే ప్రజల పట్ల సైతం ఎంత దుర్మార్గంగా ప్రవర్తిస్తున్నారో తెలియజెప్పే వ్యాసాలు ఈ మూడు పుస్తకాలలో అనేకం ఉన్నాయి.

ఆదివాసుల మనుగడకు ముప్పు వాటిల్లినప్పుడల్లా, వారి హక్కులు, చట్టాలు కాలరాయబడినప్పుడల్లా క్షేత్రస్థాయిలోను, న్యాయస్థానంలోను వారి గొంతుకై నిలిచిన వ్యక్తి బాలగోపాల్. మలేరియా మరణాలు, వాకపల్లి అత్యాచారాలు, టైగర్ ప్రాజెక్టులు, పోలీసు దుర్మార్గాలు, విషజ్వరాలు, రంగురాళ్ల తవ్వకం, బాక్సైట్ భూతం, జలయజ్ఞం .. ఒకటేమిటి గత పాతికేళ్లలో ఆంధ్ర, తెలంగాణలలో ఎక్కడెక్కడ ఎన్నెన్నిసార్లు ఆదివాసుల హక్కులకు విఘాతం ఏర్పడిందో ఆయా ప్రాంతాలన్నిట్నీ సందర్శించి ఆయన సవివరంగా రాసిన కరపత్రాలు, వ్యాసాలు, రిపోర్టులు, ఉపన్యాసాలు ఈ పుస్తకాలలో ఉన్నాయి. ఛత్తీస్‌గఢ్, ఒడిషా ఆదివాసుల కడగండ్లూ ఉన్నాయి.



ఒకప్పుడు కొందరు భూస్వాములు, మైదాన ప్రాంతం వారు, అటవీశాఖ అధికారులు మాత్రమే ఆదివాసులను దోపిడీ చేసే వారనుకునేవారు. కాని రాను రాను ప్రభుత్వ విధానాలే ఆదివాసులకు మనుగడ లేకుండా చేస్తున్నాయని 'ఆదివాసులు: చట్టాలు అభివృద్ధి' పుస్తకంలోని వ్యాసాలు చదివితే తెలుస్తుంది. ఆదివాసులకు రక్షణ కల్పించాల్సిన 1 ఆఫ్ 70, పెసా, అటవీ హక్కుల చట్టం మొదలైన చట్టాలన్నీ కూడా ఎలా నిరుపయోగంగా మారుతూ వచ్చాయో బాలగోపాల్ ఎంతో బాధగా రాశారు. 'చట్టాలే ఆదివాసులను మోసం చేసాయా?' అన్న వ్యాసంలో ఆ బాధ అంతా ధ్వనిస్తుంది. 'గిరిజనులు - గిరిజన సంస్కృతి' తో మొదలుపెట్టి చివరి వ్యాసం 'హక్కులున్నా అమలు సున్నా' దాకా పాతికేళ్ల కాలంలో ఆదివాసుల గాయాల చరిత్రంతా ఈ పుస్తకాలలో రికార్డయి ఉంది. చైతన్యం తెచ్చుకోవాల్సిన ఆదివాసులే కాదు వారికి న్యాయం చేయాలనుకునే ఇతరులు సైతం తప్పక చదవాల్సిన పుస్తకాలు ఇవి.

**- ఆత్రం భుజంగరావు**

**ఆదివాసులు: వైద్యం సంస్కృతి అణచివేత,** పేజీలు: 150, వెల: రూ.100
**ఆదివాసులు: ఛత్తీస్‌గఢ్, కంధమాల్‌పై వ్యాసాలు, నివేదికలు,** పేజీలు: 198, వెల: రూ.100
**ఆదివాసులు: చట్టాలు అభివృద్ధి,** పేజీలు: 176, వెల: రూ. 130
ప్రతులకు: నవోదయ, ప్రజాశక్తి, నవతెలంగాణ

---

# సంధి కాలం కథలు

కథల రూపంలో చరిత్రను వివరించడంలో రాహుల్ సాంకృత్యాయన్‌కు ఉన్న పట్టు తెలిసిందే. ఆయన మహా పండితుడే కాకుండా మార్క్సిస్ట్ మేధావి. ఆర్థిక దృక్కోణం కూడా జోడించి, హిందీలో ఆయన రాసిన 21 కథల సంపుటి 'బహురంగీ మధుపురి'కి ఇది తెలుగు అనువాదం. బ్రిటిష్‌వారు తమ కోసం, తమ సైనికుల విలాసాల కోసం హిమాలయ పర్వత సానువుల్లోని ప్రదేశాలను ఎంచుకునేవారు. అటువంటి ఒక ప్రాంతమే మధుపురి. బ్రిటిషర్లతోపాటు రాజవంశీకులు, సివిల్ సర్వీసుల అధికారులు కూడా అక్కడ నివసించేవారు. వారికి సేవలు అందించడానికి వ్యాపారులతోపాటు బడుగు వర్గాలు సైతం జీవనసమరంలో భాగంగా అక్కడికి చేరుకున్నాయి. అలా అక్కడ బతికిన 21 మంది వేర్వేరు వ్యక్తులను ఎంపిక చేసుకుని కథలుగా మలిచారు రచయిత. కలిమిలేములే వ్యక్తి పతాక స్థాయిని లేదంటే పతన స్థాయిని తెలుపుతాయన్న నగ్నసత్యాన్ని చక్కగా వివరించారు. సంక్లిష్ట విషయాలను సైతం కవిని ఆలూరి సరళంగా, ఆద్యంతం ఆసక్తి గొలిపేలా రాశారు. పెదాలకు పారాణి(లిప్‌స్టిక్) శ్వేతాంగనలు (పాశ్చాత్య వనితలు) వంటి పదాలు చక్కగా అమిరాయి.



**- మద్దిపట్ల మణి**

**మధుపురి** (కథా సంపుటి), రాహుల్ సాంకృత్యాయన్
**అనువాదం :** కవిని ఆలూరి, **పేజీలు :** 272, **వెల :** రూ.200, **ప్రతులకు :** విశాలాంధ్ర





# 40 వేల ముక్కలను కలిపింది...

బొమ్మల కార్పెట్‌పై ఠీవిగా కూర్చున్న ఈమె పేరు అమండా ఫంచ్ (21). జిగ్‌సా పజిల్స్ (ఒక బొమ్మకు సంబంధించిన ముక్కలను కలపడం) చేయడంలో నేర్పరి. డెన్మార్క్‌కు చెందిన ఫంచ్ ఏడేళ్ల వయసులోనే వెయ్యి ముక్కల పజిల్‌ను విజయవంతంగా పూర్తిచేసింది. ప్రస్తుతం 'ఐకియా'లో ఉద్యోగం చేస్తున్న ఫంచ్ ఇటీవల 40 వేల ముక్కలను 10 డిస్నీబొమ్మలుగా పేర్చి ప్రపంచరికార్డు సృష్టించింది. ఈ ముక్కలను జతచేసి బొమ్మలుగా మలచడానికి ఆమెకు 460 గంటల సమయం పట్టింది. జిగ్‌సా పజిల్స్ చేయడంలో ప్రతీ క్షణాన్ని ఎంజాయ్ చేస్తానంటున్న ఫంచ్ అందుకు చాలా ఓపిక అవసరమంటోంది. ప్రస్తుతం ఆమె తన రికార్డును గిన్నిస్‌లోకి ఎక్కించే ప్రయత్నంలో బిజీగా ఉంది.

అవీ-ఇవీ

# 'యాక్సిడెంట్' వినోదం

చైనాలోని గీజూ ప్రాంతంలో ఉన్న హైవే రోడ్డు మీద ఒక ట్రక్కు వేగంగా వెళ్తోంది. ట్రక్కులోని ట్రేలలో సుమారు 700 కోళ్లున్నాయి. ఇంతలో మరో ట్రక్కు ఎదురునుంచి వేగంగా దూసుకొచ్చి కోళ్ల ట్రక్కును ఢీకొంది. రెండు ట్రక్కులూ హైవేపై బోల్తాపడ్డాయి. ట్రక్కులోని ట్రేలన్నీ చిందరవందర కావడంతో వాటిలోని కోళ్లు రోడ్డెక్కాయి. దాంతో ట్రాఫిక్‌జామ్ అయింది. కొన్ని కోళ్లు రోడ్డు పక్కనున్న లోయలోకి వెళ్లాయి. యాక్సిడెంట్ విషయం తెలుసుకుని అక్కడికి చేరుకున్న 20 మంది పోలీసులు ఆ కోళ్లని పట్టుకోవడానికి దాదాపు 2 గంటలు శ్రమపడాల్సి వచ్చిందట. ట్రాఫిక్‌జామ్‌లో చిక్కుకుపోయినవారంతా చేసేదేమీలేక ఆ ఉచిత వినోదాన్ని తెగ ఎంజాయ్ చేశారట.







## వెజిటబుల్ లాలీపాప్స్

**కావలసిన పదార్థాలు**

బీట్‌రూట్- ఒకటి, క్యారెట్- ఒకటి, కాలీఫ్లవర్- సగం పువ్వు (చిన్నది), బీన్స్- పావు కప్పు, బఠాణీలు- అర కప్పు, ఆలుగడ్డ- ఒకటి, ఉల్లిపాయ- ఒకటి, అల్లంవెల్లుల్లి ముద్ద- ఒక టీ స్పూను, కొత్తిమీర- ఒక టేబుల్ స్పూను, పచ్చిమిర్చి- పది, గరం మసాలా- ఒక టేబుల్ స్పూను, బ్రెడ్ తురుము- ఒక కప్పు, నూనె- వేగించడానికి సరిపడా, మైదా- ఒక టేబుల్ స్పూను, ఉప్పు- తగినంత, ఐస్‌క్రీమ్ పుల్లలు- కొన్ని.

**తయారీ విధానం**

ఒక గిన్నెలో బీట్‌రూట్, క్యారెట్, కాలీఫ్లవర్, బీన్స్, బఠాణీలు, ఆలుగడ్డలు.. అన్నింటినీ అర టీ స్పూను ఉప్పు వేసి ఉడకబెట్టాలి. ఉడికిన తర్వాత సన్నగా తురుము కోవాలి. బాణలిలో ఒక టేబుల్ స్పూను నూనె వేసి వేడెక్కాక ఉల్లిపాయ ముక్కలు, అల్లంవెల్లుల్లి ముద్ద వేసి వేగించాలి. తర్వాత కూరగాయల తురుము, గరం మసాలా, కొత్తిమీర, పచ్చిమిర్చి వేసి 5 నిమిషాలు వేగించి దించేయాలి. ఈ మిశ్రమం చల్లారిన తర్వాత పుల్ల ఐస్‌క్రీమ్ ఆకారంలో ఉండలు చుట్టుకొని, పుల్లలను మధ్యలో పెట్టాలి. ఆ తర్వాత కొద్దిగా నీళ్ల పోసి కలిపి పెట్టుకున్న మైదాలో వీటిని ముంచి, బ్రెడ్ తురుములో దొర్లించి నూనెలో వేగించుకోవాలి. రుచిని, ఆరోగ్యాన్నీ అందించే వెజ్ లాలీపాప్స్ రెడీ!




# టేస్టీ లాలీపాప్స్..



## పనీర్ బేబీకార్న్ లాలీపాప్స్

**కావలసిన పదార్థాలు**

పనీర్- 200 గ్రా., అల్లంవెల్లుల్లి ముద్ద- ఒక టేబుల్ స్పూను, పచ్చిమిర్చి- ఆరు, ఆలుగడ్డలు- రెండు, తరిగిన ఉల్లిపాయ- ఒకటి, సోయాసాస్- అర టేబుల్ స్పూను, బేబీకార్న్- డజను, కార్న్‌ఫ్లోర్- మూడు టేబుల్ స్పూన్లు, మైదా- పావు కప్పు, కొత్తిమీర- కొద్దిగా, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం**

ఆలుగడ్డలను కుక్కర్‌లో రెండు విజిల్స్ వచ్చేవరకు ఉడికించి మెత్తగా చిదుము కోవాలి. తర్వాత మైదా, బేబీకార్న్ మినహా మిగిలిన పదార్థాలన్నిటినీ వేసి గట్టిగా కలుపుకొని 15 నిమిషాలు నానబెట్టాలి. తర్వాత చిన్న చిన్న ఉండలుగా చేసుకొని మధ్యలో బేబీకార్న్‌ను పెట్టి, మైదాలో దొర్లించి నూనెలో దోరగా వేగించుకోవాలి.



## ఆలూ లాలీపాప్స్

**కావలసిన పదార్థాలు**

ఆలుగడ్డలు- మూడు, ఉల్లిపాయ- ఒకటి, కొత్తిమీర- అర కట్ట, బ్రెడ్ తురుము- ఒక కప్పు, కారం- ఒక టీ స్పూను, ధనియాల పొడి- ఒక టీ స్పూను, అల్లంవెల్లుల్లి ముద్ద- ఒక టేబుల్ స్పూను, ఎండుమిర్చి తునకలు- ఒక టీ స్పూను, సోంపు- ఒక టీ స్పూను, నిమ్మరసం- అర టీ స్పూను, మైదా- రెండు టేబుల్ స్పూన్లు, నూనె- వేగించడానికి సరిపడా, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం**

ఆలుగడ్డలను ఉడికించి మెత్తగా చిదిమి ఉల్లిపాయ ముక్కలు, కొత్తిమీర, అర కప్పు బ్రెడ్ తురుము, కారం, ధనియాల పొడి, నిమ్మరసం, ఉప్పు, అల్లంవెల్లుల్లి ముద్ద వేసి గట్టిగా కలుపుకొని పక్కన పెట్టుకోవాలి. వేరే గిన్నెలో మైదాలో కొద్దిగా నీళ్ల పోసి కలుపుకోవాలి. అలాగే మిగిలిన బ్రెడ్ తురుములో ఎండు మిర్చి తునకలు, సోంపు వేసి కలుపుకోవాలి. ఆలుగడ్డ మిశ్రమంతో ఉండలు చేసుకొని మైదాలో ముంచి, బ్రెడ్ తురుములో దొర్లించి నూనెలో దోరగా వేగించుకోవాలి. వీటికి టూత్‌పిక్స్ పెట్టి టమోటా సాస్‌తో తింటే భలే రుచిగా ఉంటాయి.



## కాలీఫ్లవర్ లాలీపాప్స్

**కావలసిన పదార్థాలు**

కాలీఫ్లవర్- అర కప్పు, మైదా- పావు కప్పు, బియ్యప్పిండి- 2టేబుల్ స్పూన్లు, కార్న్‌ఫ్లోర్- పావు కప్పు, అల్లంవెల్లుల్లి ముద్ద- ఒక టేబుల్ స్పూను, కారం- 2 టీ స్పూన్లు, నిమ్మరసం- ఒక టీ స్పూను, తినే సోడా- చిటికెడు, నూనె- వేగించడానికి సరిపడా, ఉప్పు- తగినంత, ఎర్రటి ఫుడ్ కలర్- చిటికెడు.

**తయారీ విధానం**

వేడినీటిలో కాలీఫ్లవర్స్‌ను వేసి సగం ఉడికాక దించి ఆరబెట్టుకోవాలి. నూనె, కాలీఫ్లవర్స్ మినహా మిగిలిన పదార్థాలన్నిటినీ బజ్జీల పిండిలా కలుపుకోవాలి. బాణలిలో నూనె పోసి వేడెక్కాక ఆ పిండిలో కాలీఫ్లవర్ ముక్కల్ని ముంచి బజ్జీలా వేసుకోవాలి.

